

చిరస్మరణీయ దేశోద్ధారకుడు

చైత్రశుద్ధ ద్వాదశీ, గురువారం (11-4-5౯) వర్ధంతి.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 4 అ.



సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 51
సంచిక 32
10-4-57

హేవిళంబి చైత్ర శుద్ధ దశమి బుధవారం


విషయానుక్రమణిక


ముఖచిత్రం : హిందీనటి శ్యాను

| | |
|---|---|
| దివ్యస్మృతి— | 3 |
| న్యూఢిల్లీ లేఖ—శ్రీకృష్ణ | 5 |
| బుడుగు, చిచ్చుల పిడుగు— | 6 |
| రామభక్తుడు—"శివరామ" | 9 |
| మిత్రద్రోహం—బి. వి. రమణరావు | 13 |
| శ్రీమతికి చీర కొనాలి—"జగన్నాథ్" | 19 |
| పరమ శివార్చన—పి. గణపతిశాస్త్రి | 20 |
| గజ్జెలదయ్యం—"అనూరాధ" | 24 |
| రంగమ్మనవ్వు—వి. ఎస్. అవధాని | 26 |
| అదుగో భద్రాద్రి!— | 28 |
| అపరబుద్ధి—తుమ్మలపల్లి సీతారామారావు | 30 |
| వనితాలోకం— | 35 |
| వేసవిలో పిల్లల సంరక్షణ —పంతుల సౌభాగ్యలక్ష్మి | 36 |
| కొందరికి పచ్చిబియ్యం, చెక్కపొడుం రుచి —కుమారి సి. రాధ | 37 |
| ఇరుగూ-పొరుగూ—బి. యస్. లక్ష్మి | 38 |
| కథకాదు—గుడివాడ సుశీల | 39 |
| తెలుగు సినిమాలు— | 40 |
| జున్నుగడ్డితో—యు. సత్యబాలాదేవి | 42 |
| నాన్నకథ—ఏలూరిపాటి అనంతరామయ్య | 43 |
| పులితోలు—కవిరావు | 44 |
| సినిమా— | 47 |


గమనిక

గత వారం ముఖచిత్రం వేసినవారు శ్రీమతి శ్యామ సుందరీదేవి [శ్యామాకౌండిన్య] అని పాఠకులు గ్రహింప మనవి.

## దివ్యస్మృతి

# దేశోద్ధారకుడు

భారత జాతీయోద్యమంతోపాటు ఆంధ్ర సామాజిక వ్యవస్థలో సాహితీపరుల సంస్కారప్రియుల ఉద్యమాలు కూడా బయలుదేరాయి. ఆంధ్ర సారస్వత రంగంలో నవనవోన్మేషమైన ప్రతిభా సంపత్తితో కృషిచేసి సమాజ వికాసానికి తోడ్పడిన మహనీయులలో కందుకూరి, చిలకమర్తి గురజాడలు చిరస్మరణీయులు. వీరు సమాజాభ్యుదయాన్ని దృష్టిలో పెట్టుకొని, సంస్కృతినీ, అభ్యుదయాన్నీ ఆశించి కావ్యరచన సాగించారు. అట్టి సాహిత్య సేవద్వారా సమాజంలో పరివర్తనను కలిగించారు. అట్టి సాహిత్య ఉద్యమమూర్తులు జాతి సౌభాగ్యకారకులై జాతి చరిత్రలో నిలిచిపోతారు. వారి ఉద్యమాల ఫలితంగా నిద్రాణమైన జాతి మేలుకొని నూతనశక్తి సంపదలతో చైతన్యవంతమవుతుంది.

సారస్వతం సాధనంగా గ్రహించి సంఘ పరివర్తనకొనివచ్చినవారిలో "విశ్వదాత" అగ్రగణ్యులు. ఆ మహనీయుడు ఉన్నత సంస్కారి. వారు కాంక్షించిన సామాజిక జీవనం సమున్నత లక్ష్యాలతో కూడినది. స్వీయప్రతిభతో, పరిపక్వమైనచిత్త సంస్కారముతో, సారస్వతరంగంలో వారు 'ఉద్యమమూర్తి'గా నిలచిపోయారు.

నాగేశ్వరరావుగారు విశ్వదాత; దేశోద్ధారకుడు; కళాప్రపూర్ణుడు, పూర్ణపురుషుడు, ఆయన సమగ్రజీవిత విశేషాలను తెలిసికొనే అవకాశాలు అట్టే లేవు - ఎందువల్లనంటే ఆయననుగూర్చిన గ్రంథాలు కనుపించవు. బాల్యంలో నాటక కళమీద అభిరుచిని ప్రదర్శించారు. విద్య పూర్తి అయిన వెంటనే, దేశంలో నలుమూలలా వ్యాపించిన జాతీయచైతన్యం వారి దృక్పథాన్ని ఆకర్షించి, కార్యరంగంలో వారిని మహాపురుషుని గావించింది.

సుమారు నలభై సంవత్సరాల క్రిందట తెలుగువారు కార్య సాధకులు కావాలని వారు ప్రబోధించారు. సమాజ అభ్యుదయాన్నే ఆదర్శంగా గ్రహించి, జాతి వ్యక్తిత్వ వికాసాన్నే ధ్యేయంగా స్వీకరించి, వివిధ రంగాలలో వారు కృషి చేశారు. ఆంధ్ర పత్రికను స్థాపించి, ఆంధ్రప్రజల ఆశయాలను అందులో ప్రతిబింబింప జేసి, నిద్రాణమైన సామాజిక వ్యవస్థను నూతనశక్తితో సంచలింప చేసిన మహాపురుషుడు ఆ విశ్వదాత.

భాషారాష్ట్రోద్యమానికి దేశోద్ధారకుడు పట్టుగొమ్మ. భాషారాష్ట్ర నిర్మాణం ప్రజా వికాసానికి, దేశ వికాసానికి తోడ్పడగలదనే పరమ విశ్వాసముతో, అకుంఠిత కార్య దీక్షతో నిర్మాణాత్మకమయిన కృషిచేశారు. జాతి సర్వతోముఖ ప్రతిభను వ్యక్తీకరింప చేసేది భాషేనని చాటారు. తెలుగు భాషా ప్రాభవాన్ని రూపొందించి, ప్రజల జీవితానికి మెరుగులు దిద్దారు. పత్రికా సారస్వతాన్ని పెంపొందించి జాతి సంస్కృతికి ఉన్నతస్థాయిని సాధించారు.

పంతులుగారు "పుణ్యపురుషులు." ప్రజలు వైజ్ఞానికంగాను, సాంస్కృతికంగాను, సముజ్జ్వల వికాసం పెంపొందించుకోడానికి వారు చేసిన సేవ అపారమైనది; అమూల్యమైనది; ఆయన కార్య నిర్వహణలో ప్రదర్శించిన ప్రతిభ అనల్పమైనది.

పంతులుగారి భాషాభిమానం అప్రతిహతమైనట్టిది. భాషావికాసానికి తోడ్పడడం వారికి మిక్కిలి ప్రీతి. భాషాసంపద ప్రాశస్త్యాన్నిగురించి, వాఙ్మయనిర్మాణ ఆవశ్యకతనుగురించి వారు పలుచోట్ల ప్రస్తావించారు. వారిది కళాదృష్టిని అలవర్చుకొన్న విశాలహృదయం. కేవలం సాహితీపరుడుమాత్రమే కాదు; గొప్ప సాహిత్య విమర్శకులు కూడా. ఇట్టి నిర్మాణాత్మక కళాదృష్టి పంతులుగారి వ్యక్తిత్వానికే పరాకాష్ఠ. దేశాభివృద్ధి, పురోగమనం, భాషాయత్తము గనుక భాషాసంపదను జాతీయ సంపదగా పరిగణించాలన్నది వారి హితవు. పాశ్చాత్య సారస్వతప్రభావం ఆంధ్ర సారస్వతముపై అనివార్యమనీ, భావుకు విశేషమైన వాఙ్మయనిర్మాణం కావింపవలసియున్నదనీ, పంతులుగారు ప్రవచించారు. అట్టి విశాలదృష్టితోనే వారు సారస్వత వ్యాసంగం సాగించారు.

చక్కని సమీక్షలతోను, సాహిత్య విమర్శలతోను చైతన్యవంతమైన సారస్వత స్రవంతిని ప్రవహింపచేశారు. నిర్దుష్టమైన, పటిష్ఠమైన రచనా వ్యాప్తిమూలంగా ప్రజాజీవనంలో సంచలనం కలిగించడానికి ఆయనదీక్ష వహించి ఆ విధంగా కృషి చేశారు.

ప్రగతిశీలము గల వివిధ సాంస్కృతిక ఉద్యమాలకు వారు పెద్ద అండగా నిలచారు. శిల్పం, చిత్రకళ, సంగీతం మొదలైన లలిత కళలలో ప్రవేశమున్న వారిని ఇతోధికంగా ప్రోత్సహించారు. కళా రంగాలలో ఆసక్తిని ప్రదర్శించి, కళాభిజ్ఞతను వెల్లడించి తద్వారా సామాజికవ్యవస్థను బలీయంచేసి, ఉన్నతమార్గాన జాతిని పురోగమింపచేశారు. ఈవిధంగా విశ్వదాత ఆధునికాంధ్రకు వ్యక్తిత్వ ప్రదాతగా భాసిల్లారు.

సామాజిక పరివర్తన ఫలప్రదం కావాలంటే, ప్రజలలో విద్యా విజ్ఞానాలు పెంపొందాలి. అందుకై విజ్ఞాన సర్వస్వ ప్రచురణకు ఉపక్రమించారు. హరిజనాభ్యుదయాన్ని ఆయన మనస్ఫూర్తిగా ఆకాంక్షించి, అందులకు కృషి చేశారు. అపరిమిత వితరణ గుణాన్ని ప్రదర్శించి, ప్రజాసేవచేసిన మహనీయుడు మన విశ్వదాత.

ఆయన జీవితమే ఆధునికాంధ్రజాతికి ఒక మహత్తర సందేశం; ఆయన ఉద్యమ నిర్మాణశక్తి ఒక చైతన్య స్రవంతి; అఖండ ప్రతిభాశాలిగా, ఆదర్శ ఉద్యమమూర్తిగా వదాన్యుడుగా, భాషాసేవకుడుగా, దేశోద్ధారకుడుగా ప్రసిద్ధిగాంచిన మన విశ్వదాత ఈశ్వర సాయుజ్యం పొంది ఏప్రిల్ 11-వ తేదీకి (తెలుగు పంచాంగం ప్రకారం) 19 ఏళ్ళు పూర్తి అవుతున్నవి. 20 ఏడు ప్రారంభమవుతున్నది.

ఈ పవిత్ర వర్ధంతి సమయంలో, ఆ మహనీయుని సముచితంగా సంస్మరించుకొని, ఆయన చూపిన బాటలో విశాలాంధ్ర అభ్యున్నతికి కృషి చేయడం ప్రతి ఆంధ్రుడి కర్తవ్యం!

—వసంతరావు వెంకటకృష్ణరావు]

★




Erasmic
PERFUMED COCONUT HAIR OIL
JASMINE
Erasmic
PERFUMED COCONUT HAIR OIL
ROSE




# ప్రైవేటు రంగంలో ఉత్సాహ లోపం

శ్రీ కృష్ణ

[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

ఢిల్లీలో ఈ మధ్య వరసగా బోలెడన్ని సంఘటనలు జరిగాయి. భారతీయ వాణిజ్యమండలుల ఫెడరేషన్ సమావేశంతో అవి ప్రారంభమయ్యాయి. పోలిష్ ప్రధాన మంత్రి, పశ్చిమజర్మనీ విదేశాంగమంత్రి భారతదేశం దర్శించవచ్చారు. పార్లమెంటులో విదేశాంగ వ్యవహారాలపై చర్చ, సాధారణ బడ్జెట్ పై మూడురోజులు జరిగిన చర్చకు ఆర్థికమంత్రి సమాధానమివ్వడం జరిగాయి. కొత్తగా ఎన్నికలలో గెలిచి వచ్చిన ఉత్సాహంతో ఆచార్య కృపలానీ విదేశాంగ విధానచర్చలో పాల్గొని తీవ్రవిమర్శలు చేశారు. కాని పార్లమెంటు పరిస్థితి ఎలాఉందో చెప్పాలంటే ఆర్థిక మంత్రి వర్ణన సరిగ్గా సరిపోతుంది. బడ్జెట్ చర్చకు సమాధానమిస్తూ శ్రీ కృష్ణమాచారి ఇలా అన్నారు:

"అడపాతడపా తప్పిస్తే మొత్తంమీద చర్చ అంతా జీవరహితంగా, నిరుత్సాహంగా ఉంది. ప్రభుత్వపక్షానికైతే ఇలా ఉంటం మంచిదే. కాని పార్లమెంటు దృష్ట్యా, అది నెరవేర్చవలసిన ప్రయోజనాలదృష్ట్యా, ప్రజాశ్రేయస్సుదృష్ట్యా ఈ చర్చ చాలాఅసంతృప్తికరంగాఉంది. సభలో ప్రతిపక్షసభ్యులు సరిగ్గా పలుగురే ఉన్నారు. వారిలో ఒకరు పెదవి విప్పనేలేదు."

## ఫెడరేషన్ సమావేశం

భారతీయ వాణిజ్యమండలుల ఫెడరేషన్ సమావేశం యథోచితమైన ఉత్సాహ వాతావరణంలో జరిగింది. ఫెడరేషన్ అధ్యక్షుడు జాగ్రత్తగా ఇంగ్లీషులో తయారు చేసుకున్న ఉపన్యాసం చదివారు. కొన్ని ఉచ్చరించడానికి కష్టమైన మాటలు కూడా వాడారు. ఈ ఉపన్యాసానికి సమాధానమిచ్చిన ప్రధానమంత్రి ద్విభాషాతత్త్వం ప్రదర్శిస్తూ, స్వచ్ఛమైన హిందీలోనూ స్వచ్ఛమైన ఇంగ్లీషులోనూ మాట్లాడారు.

సంప్రదాయ ప్రకారం ఫెడరేషన్ 8 తీర్మానాలు చేసింది. సభ్యులు తమ తమ కోర్కెలను ఈ తీర్మానాలలో వెలిబుచ్చారు. ఎగుమతులను ప్రోత్సహించాలని వాటిలో ఒక తీర్మానం కోరుతున్నది. ప్రభుత్వం ఏయే ఎగుమతులను ప్రోత్సహించాలో ఒక జాబితాకూడా ఇచ్చారు. అయితే ఒక ప్రశ్న. ప్రభుత్వం ఇచ్చిన వాణిజ్యసదుపాయాలను దేశంలోని పారిశ్రామికులు ఎంతవరకూ వినియోగించుకోగలిగారు? ఒక ఉదాహరణ: క్రిందటి ఏడాది శ్రీ హెచ్. వి. ఆర్. అయ్యంగార్ నాయకత్వాన ఒక వాణిజ్య రాయబార వర్గాన్ని స్కాండినేవియన్ దేశాలకు పంపించారు. ఆదేశాలుకూడా తిరిగి తమ వాణిజ్యరాయబారవర్గాలను పంపించాయి. ఈ రాయబారవర్గాలు ఆయా దేశాలమధ్య వాణిజ్యానికి అమోఘమైన అవకాశాలున్నాయని అభిప్రాయపడ్డాయి. భారతదేశంనుండి తాము దిగుమతిచేసుకోవలసిన వస్తువులనేకం ఉన్నాయని స్కాండినేవియన్లు అన్నారు. కాని వాటి నిక్కడ ఎగుమతిచేసేదెవరూ అని ప్రశ్న.

వస్త్ర పరిశ్రమకు సంబంధించినంతవరకూ భారతీయ పారిశ్రామికులు మంచి ఉత్సాహమే ప్రదర్శించారు. కాని ఈ ఉత్సాహం ఏకోన్ముఖంగానే వుందిగాని బహుముఖంగా ప్రదర్శితం కావడంలేదు. త్వరగా, సులభంగా ధనం ఆర్జించాలనే ఆశయే దీనికొక కారణం. చాలా సందర్భాలలో, తయారైన వస్తువుల నాణ్యం అధ్వాన్నంగా ఉంటోంది. ఒక్కొక్కసారి బంగీలు కట్టడంకూడా సరిగాలేక వాణిజ్యసంబంధాలు చెడుతున్నాయి. పారిశ్రామికులకు తమదేశ ప్రతిష్ఠపై అభిమానం, తమపనిపై, తమ పరిశ్రమపై గౌరవం ఉండాలి. ఇది లేకపోవడం అప్పుడప్పుడు పెద్దలోపంగా తయారవుతోంది.

ఎగుమతులను ప్రోత్సహించడానికి చర్యలుతీసుకోవాలని ప్రభుత్వాన్ని పదే పదే కోరడమేగాని, వున్న సదుపాయాలను వినియోగించుకునే ప్రయత్నం కనబడదు.

(54-వ పేజీ చూడండి)



# బుడుగు! చిచ్చులపిడుగు

యేం-ఎలాగంటే, బాబాయిని ఖద చెప్పమని వినడం. అప్పుడు ఛాలా అల్లరి చెయ్యంగా.

ఓసారేం, రేపో యివాళో నానకి నామీద కోపం వచ్చిందిగా నేను ఆడుకుంటుంటే.

వురేయి బుడుగూ అలా అడ్డ బాబాయిలా తిరక్కపోతే పడుకుని నిదరోకూడదూ అన్నాడుగదా.

అప్పుడేమో బాబాయికి కోపం వచ్చేసింది. ఎందుకనో. నానవేపు యిలా చూశాడు.

వాడు అల్లరిచేస్తే నన్ను కోపడతావే అనేశాడు కోపంగా. అనేసి వురేయి బుడుగూ యిలా రాగా చదువుకో అని ఓ పెద్ద పుస్తకం ఇచ్చేశాడు.

నా కసలే పుస్తకాలంటే చాలా యిష్టం కదా. కదలుంటాయట వాటిలో. పుస్తకం పట్టుకుంటే అయిపోయేదాకా వదల్నట నేను. ఇలాని బాబాయే చెప్పాడు.

కాని నానకి నేను పుస్తకం పట్టుకున్నా కోపం మరి. కోపం అంటే బయం అని తెలుసుగా. ఇపుడు నేనేమో బళ్లో పడిపోతానూ పుస్తకం యియ్యి అని బయిపెట్టు తానుగదా నానని. అపుడు వాడికి కోపం వచ్చేస్తుంది.

ఇలా రా కూచో అని ఖద చెపుతాడు. లాపోతే బాబాయిని చెప్పరా అంటాడు.

బాబాయికి రెండుజెడల సీతల ఖదలు ఛాలా వచ్చును. కాని అవి బావుండవుగదా. వాడికి అలాడీను ఖదకూడా వచ్చును. నాకు బలే యిష్టంకూడా అది. మాజిక్కులవాడు వుంటాడేం అదీ. మాజిక్కులవాడు అంటే బుడబుడకలవాడులే.



నేను పుస్తకం మొదలెడితే దాని అంతు తేలిస్తే కాని వదలను ([illegible])

నానకి కోపం వస్తే అప్పుడు బాబాయి నాకు ఖద చెప్పాడులే.

యేం. ఈ అలాడీను ఓ చిన్న పిల్లాడు. వాడు అనగనగా ఉన్నాడు. అనలు చైనా వాడులే. జెడేసుకుంటాడు.

యేం వాడు ఓ రోజున వీదిలో ఆడుకుంటున్నాడుగదా మరి. అపుడేమో బుడబుకలవాడు వచ్చాడు.

వురేయి, అలాడీనూ నువ్వు గోపాళం వాళ్ల కుడుకువిగదూ అన్నాడు.

అపుడు అలాడీను నీకెందుకు ఫోరా అని చెప్పాడు.

బుడబుకలవాడేమో యిలా నవ్వేసి, నేను ఫోనురా అన్నాడు. వురేయి అలాడీనూ నువ్వు నాతోటి కుంచెం అలా వస్తావురా పనుంది అని అడిగాడు.

అలాడీనుకూడా ఇలా నవ్వేసి గ్రుహాఒగ్గిరికేనా నీకు మాజికు లైటు కావాలి కదూ నాకు తెలుసులే దొంగా అనేశాడు. మాజికులైటు అంటే అరికిను లాంతరు లేదూ అదన్నమాట.

బుడబుడకలవాడు హాచ్చెర్య పడిపోయేశాడు అంతే. అలా పడిపోయేసి మళ్ళీ లేచి, అవును రా హాలాడీనూ నీకు ఎలా తెలిసిందిరా అన్నాడు ఇంకా హాచెర్యంగా.

హే. ఎలా తెలుస్తుంది. మా బాబాయి చెప్పాడులేరా అన్నాడు అలాడీను.

బుడబుడకలవాడు బయపడిపోయేసి, అవునుగాని మరి నాతో వస్తావా. నీకు మంచి మితాయి పెట్టుతాను అన్నాడు.

మితాయి వద్దూమరేమో నారాయణ కొట్టులో వేడి పకోడీలు కొని పెట్టితేవస్తానూ లాపోతే రానుఫో అని చెప్పేశాడు అలాడీను.

అపుడేమో బుడబుడకలవాడూ అలాడీనూ గుర్రం ఎక్కి టకటకా టకటకా పేద్ద అడివిలోకి వెళ్ళి




పోయారన్నమాట పకోడీలుతింటూ.

అక్కడే, గ్రుహ ఉంది. గ్రుహ అంటే నా తలకాయ. ఏదో ఓటిలే. నీకెందుకు ఖద విను.

యేం. అక్కడేమో గుర్రం దిగి పోయారు. బుడబుడకలవాడు గ్రుహ దగ్గిర నించుని యిలా అని ఏదో మంతరం వేశాడు.

హాచెరం! పేద్ద చప్పుడు ఫేలి పోయింది. బేద్ధ మంట ఫొగ వచ్చే శాయి హాపుడు.

బుడబుడకలవాడు యిలా బయి పడిపోయేసి, హాబ్బ ఏంమంటరా ఓరి బాబ్బోయి అనేశాడు.

కాని అలాడీను అస్సలు బయ పడలేదు. బయం అంటే ఏమిటో తెలీదుగా మరి. వాళ్ళ బాబాయి చెప్పలేదులే. వురేయి బయంలేదు బుడబుడకలవాడూ అని చెప్పేశాడు అలాడీను. అపుడేమో వాడు సరేను అన్నాడు.

అంతలో ఎవరోవచ్చి యింత చిన్న తలుపు తీశారుగదా.

అలాడీనూ నువు లోపలికి వెళ్ళి అక్కడ మాజిక్కు లైటుంది కుంచెం తెచ్చిపెట్టమ్మా అన్నాడు బుడబుడకలవాడు.

మరి నేను చిన్నవాడినీ చితక వాడినీగదా. నాకు బయం కదా ఎలాగ బాబూ నేను వెళ్ళనూ అన్నాడు అలాడీను.






#  బుడుగు! చిచ్చుల పిడుగు! 

బుడబుడకల వాడేమో నీకు పరవాలేదు లేరా, నీకు వుంగరం ఇస్తా వెళ్లమ్మా అన్నాడు.

అపుడు సరేని అలాడీను వెళ్లి లాంతరు తెచ్చాడు.

లాంతరు నాకిచ్చెయ్యి నువు తరవాతరా అన్నాడు బుడబుకలవాడు.

నాకు పదికాణీలు ఇస్తావా అన్నాడు అలాడీను.

వాడు ఇస్తాను అన్నాడు.

ముందర యియ్యి మరి అన్నాడు అలాడీను.

కాని వాడిదగ్గిర నిఝంగా లేవుగా. అందికని కోపంగా లాంతరు యియ్యా లాపోతే మూతపెట్టేస్తాను అంతే అన్నాడు బుడబుకలవాడు.

అలాడీనుకి తెలుసుగా వాడు ఎలాగా తలుపేసేస్తాడని. బాబ్లి బాబాయి ముందస్తుగా చెప్పాడుతే. అందికనే పంచెం ఏడిపించాడు. పది కాణీలు కావాలని.

యేం. అప్పుడేమో మరేమో వాడికి కోపం వచ్చిందిగా. హుం అనేసి తలుపు వేసేశాడు ధామని. వేసేసి అక్కడే చచ్చిపో వెదవాని అన్నాడు.

అలాడీను హో హో అని నవ్వేశాడు. నాకు తెలుసులే పోరా అన్నాడు. అనేసి ఆ లాంతరు లేదూ. మాజిక లాంతరు. దానిమీద యిలా గోకేశాడు. అప్పుడు యింతపెద్ద బూతం వచేసింది. బూతం అంటే పేద్ద రాక్షసి.

లావుపాటి పక్కింటి పిన్నిగారు కన్నా యింకా లావుగా ఉంటుంది.

అరెరే. అన్నట్టు నువ్వు కాదురా నువ్వు ముందస్తుగా రాకూడదు హూష్ మాంకాళీ షో అన్నాడు అలాడీను కళ్లు మూసేసుకుని యిలా.

తరవాతేమో, ఆ వుంగరం ఉందిగదా, బుడబుడకలవాడు యిచ్చిండి. దాన్ని మెల్లిగా యిలా గోకాడు. అప్పుడేమో యింత చిన్న బూచివాడు వచ్చాడు. వీడు బుడుగు అంత కూడా లేడనుకో.

అపుడు అలాడీను హాచెర్య పడిపోయాడు హా! అని.

బూచివాడేమో ఇంచక్కా నవ్వి ఎందుకండీ అలాడీనుగారూ అలా హాచెర్య పడతారూ, మరేమోనూ ఇది గోకితే నేను వస్తానని మీకు ఇందాకలే తెలుసుగా అన్నాడు.

ఖదలో అలా ఉంది లేవోయి నువ్వు ముందస్తుగా ఈ గ్రుహ తలుపు తియ్యి అన్నాడు అలాడీను.

నాకు తలుపుతియ్యడం రాదండి. పాపం చిన్న వాడినికదా ఎలా అని యిలా బోల్డు ఏడిచేశాడు ఉంగరం చూచాడు.

మరి అలాడీను అలాగే గ్రుహాలో ఉండిపోయాడా. లాపోతే ఎలా యింటికెళ్లాడు. ఎలాగంటే ఆనక చెప్పతానులే. 



# రామభక్తుడు

అప్పటికి కాలం వుదయం పదిన్నర గంట లయివుంటుంది: డాక్టరు రంగనాధరావు గారు అంతక్రితమే యెవరో రోగికి యింజక్షను చేసి, తిరిగి తమ గదిలోకి వచ్చి చేతులు కడుక్కుంటూంటే, శ్రీమన్నారాయణగా రక్కడికి: "నమస్కారం డాక్టరుగారూ! మద్రాసు నుంచి ఎప్పుడు వచ్చారు?"— అంటూ ప్రవేశించారు!

"ఓ...శ్రీమన్నారాయణగారా! నమస్తే. మీకు నేనే కబురు చేదామనుకుంటూంటే మీరే వచ్చారు. నిన్న రాత్రి జనతాకు వచ్చాను. అరే...అలా నిల్చుండి పోయారేమిటి? అలా కుర్చీలో కూర్చోండి"— అంటూ ఆయన కొక కుర్చీ చూపించి, డాక్టరుగారు తమ కుర్చీలో కూర్చున్నారు.

కొద్ది నిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి. శ్రీమన్నారాయణగారు మందహాసం చేస్తూ డాక్టరుగారి వంక చూస్తూ: "మీరు వెళ్ళిన పని పండయిందా?" అని అడిగారు!

"ఏం పండవటం! ఎక్కడ వేసిన గొంగళీ అక్కడే వుండిపోయింది"

"అంటే—"

"ఏమీ అవలేదు"

"మీరు పై అధికారుల్ని కలుసుకున్నారా?—" శ్రీమన్నారాయణ గారు విషయాలు తెలుసుకోవటంలో ఆదుర్దా చూపించారు!

"ఆ"—నవ్వారు డాక్టరుగారు...

"మరి—" శ్రీమన్నారాయణ గారు, డాక్టరుగారి వంక చూశారు!

"ఇక్కడ కొత్తగా వున్నత పాఠశాలను స్థాపించటానికి పై అధికారులు చాలా అభ్యంతరాలు చెప్పారు"

"ఏవో అభ్యంతరాలుండ వచ్చని మనమూ అనుకొన్నాముగా!"

"అవి మనం అనుకొన్నివి కాదు"— డాక్టరుగారు నవ్వారు.

"మరి"—

"స్వయంగా పోషించుకోలేని స్థితిలో మన రాష్ట్రింలో-స్థానిక సంస్థల అధీనంలో చాలా ఉన్నత పాఠశాలలు వున్నాయట. స్వయం పోషక శక్తి లేనటువంటి - వాటిని దీర్ఘకాలం నుంచి పోషించుకుంటూ వస్తూండటం చాలా ప్రయాసతో నిండి వున్నందున-మరి కొత్త ఉన్నత పాఠశాలలు స్థాపన చేసే తలంపులు - కొన్ని పరిస్థితుల్లో మినహాగా వుపసంహరించుకొన్నారట"— డాక్టరు గారు యిలా అంటూంటే ఆయన మాటల కడ్డువస్తూ!" మనది అనేక సదుపాయాలు కల మంచి జనాభాగలపట్టణం! చుట్టుప్రక్కల వూళ్లకు సదుపాయంగల కూడలి స్థలం అనీ-ఇక్కడ కనక వున్నత పాఠశాల యేర్పాటు చేసిన పక్షంలో - చదువుకొనే విద్యార్థుల సంఖ్య పెరుగుతుందనీ ఆ సంఖ్య మూలకంగా పాఠశాల తన్ను తాను పోషించుకో కలుగుతుందనీ మీరు చెప్పలేక పోయారా?"-అన్నారు శ్రీమన్నారాయణ గారు.

రంగనాధరావు నవ్వారు!" శ్రీమన్నారాయణగారూ! మీరయితే అమాయకంగా ఏమిటేమిటో చెబుతున్నారు. కాని - విశాల దృష్టితో చూచే పై అధికారులకు మన కష్ట

*~~~~~~~~~~~~~~~~~~~~*

"శివరామ"

*~~~~~~~~~~~~~~~~~~~~*

సుఖాలు యోచించి సహాయపట్టం చాలా భారంతో కూడివుంది! అందువల్ల వారిమాటలు తప్పని సరిగా 'వూ(' కొట్టవలసిందే! అదాలా వుంచండి. అధికారులతో- యిక్కడి మన పరిస్థితులూ, వున్నత పాఠశాల ఆవశ్యకత గురించీ వివరంగా చెప్పాను. వారు దయతో నా మాటలువిని- పాఠశాల అభివృద్ధిదృష్ట్యా, తాము చెప్పే కనీస యేర్పాట్లుచేసిన పక్షంలో కమిటీ స్కూలుగా అనుమతించటానికి వీలుంటుందన్నారు."

"ఏమిటండీ అవి?"—శ్రీమన్నారాయణ గారు డాక్టరుగారివంక ఆశగా చూశారు.

"పెట్టబోయే బడి- అదే కమిటీ పాఠశాల అనుకోండి...తన్ను తాను మూడు సంవత్సరాల కాలం పోషించుకోటానికి అవసర ఎమౌంటు చూపిన పక్షంలోనూ, పాఠశాల ప్రారంభించే ముందుగానే భవననిర్మాణం పూర్తయిన పక్షంలోనూ—ప్రత్యేక పరిస్థితుల్లో తాము రికగ్నిషను యివ్వగలమన్నారు."—

"అబ్బా! అయితే అవి గట్టిషరతులే! ఇంతకీ- స్థానికసంస్థల అధీనం చేయటానికి- వీలులేదన్నమాట."

"ఎలా చేసుకుంటాము? వాటి నిర్వహణమే చాలా కష్టంగా వుంటున్నప్పుడు!"-

శ్రీమన్నారాయణగారు, కొద్దికాలం యోచించి: "అయితే మనం చేయవలసిన పనియేమిటి ?"—అని ప్రశ్నించగా,"మరేం వుంది...మరి చేయవలసిన పనులు మనకు సాధ్యమయ్యేవి కాదుగనుక మాట్లాడక వూరుకోవటమే"—అన్నారు డాక్టరుగారు తమాషాగా!

శ్రీమన్నారాయణగారు తెల్లబోతూ: "చివరకంతే!" అన్నారు. "మరేంచేసేది ? పాఠశాలకు ఏదో బిల్డింగు కట్టుడానికి కనీసం పాతిక వేలు కావాలి! మూడు సంవత్సరాల కాలం - నూతన పాఠశాల తన్ను తాను పోషించుకోవటం అంటే మాటలా ? అదో పాతిక వేలు లెక్క వేసుకోండి. మొత్తం ఏభై వేలరూపాయలు కావాలి...ఎవరిస్తారు? ఇది ఎటువంటివూరు ? మీకూ అన్నీ తెలుసు కదా! అందువల్ల నా మట్టుకు నేను మాటాడక వూరుకోవటం మంచిదనుకుంటున్నాను"—రంగనాధరావు గారిలా అంటూంటే, "ఏభైవేల రూపాయలంటే మాటలు కాదనుకోండి. ఏమైనా మీబోటి పెద్దలు తలుచుకుంటే యెంత ? కొండమీద కోతినయినా — తీసుకురాగల సమర్థులు మీరు" — శ్రీమన్నారాయణగారు తమాషాగా నవ్వారు.

"మీరు వూహించి అంటున్నంతటి సమర్థత నాలో లేదు సుమండీ! ఏదో—సేవ చేస్తున్నానంతే! అంతా సానుకూలమైతే కార్యభారం నానెత్తిని పెట్టుకొని, కాకి విధంగా తిరిగి పనిచేయించుకు రాగలను కానీ-కావలసిన మొత్తం పెట్టుబడి పెట్టలేను కదా!అటువంటిమహత్తరశక్తినాకు లేదుకదా

"అబ్బ ఎంతమాట సెలవిచ్చారు! ఈ పని చేయగలనని-తిరిగేవాళ్లు మాత్రం యీ రోజుల్లో ఎవరున్నారండీ?-మీబోటి స్వార్థ చింతనలేని పెద్దలుండటం వల్లనే మనపట్టణం యీ విధంగా పెరుగుతూంది! ఏదో విధంగా యిక్కడ వున్నతపాఠశాల స్థాపించే యేర్పాటుచేసి-పిల్లల విద్యాభివృద్ధికి మీరు సహాయపడాలి."

"డాక్టరుగారు నవ్వి అన్నారు!" నేనేం చేయాలో నాకు తెలియటంలేదు! మీ వుద్దేశం చెప్పండి" "డబ్బును గురించి మీరేమంటారు?"

 

# రామ భక్తుడు



"ప్రోగుచేయటమే!"

"ఎవరి దగ్గర?"

"పెద్దల దగ్గర - ప్రజానీకం దగ్గరా"-శ్రీమన్నారాయణగారు నవ్వారు.

"కానీ డబ్బుకు కక్కుర్తిపడే యీ వూరు పెద్దలు పాఠశాలకోసం, ఏభై వేల రూపాయలు తెచ్చి యిస్తారా? ఏలాగో-భగవంతుడు రామచంద్రుడిక్కడ సతితో వెలయటం వల్ల, కొంత మహత్తువాళ్లకు కనపడటంవల్ల ఆవేశం కొద్దీ దేవాలయ నిర్మాణానికి...ఆ మొత్తం, మూడు సంవత్సరాల కాలంలో సమకూరార్చుకొని...మరో పనికయితే యిచ్చేవాళ్లుటండి"-డాక్టరు రంగనాధరావు గారన్న ఈమాటల్లో చాలా యదార్థంవుంది! ఆ వూళ్లో భాగ్యవంతులు చాలామంది వున్నారు. అయితే ప్రయోజనం ఏమిటి? అందులో కాని త్యాగబుద్ధితో వదిలే నిర్మల హృదయులు యెవరూ లేరు! ఏలాగో-భగవంతుడు రామచంద్రుడు-ఆ వూళ్లో సతీసమేతంగా వెలయటం వల్ల, వెలసినకొద్ది కాలానికే-కొంత మహత్తు వూళ్లో జరిగి వుండటంవల్ల, గ్రామస్థుల్లో ఆవేశం బయలుదేరింది! అ ఆవేశంమీద—మూడు సంవత్సరాల కాలంలో-దేవాలయ నిర్మాణానికి వుత్సవం జరపటానికి-ఏభై వేల రూపాయల వరకూ ప్రోగుచేసారు! ఆడబ్బు పూర్తిగా ప్రోగుచేసి, సంవత్సరం పైచిలుకయింది! మొదటినుంచి అది బ్యాంకులోనే వుంటోంది కాని-దాన్ని వెచ్చించి దేవాలయ నిర్మాణం ప్రారంభించిందిలేదు! ప్రోగుచేసిన డబ్బు మీద అజమాయిషీ సాగిస్తున్న పెద్దలే—దేవాలయ నిర్మాణసమయంలో దానిమీద అధికారం కలిగివుండటం-వూళ్లో కొందరు వ్యక్తులకు యిష్టంలేక పోయింది! ఆ భేదాభిప్రాయాలకు పర్యవసానంగా డబ్బు బ్యాంకులో వుండిపోయింది! వెలసిన సీతారాములకు మాత్రం—తాత్కాలికాలయం—తాటి యాకులతో నిర్మించటం జరిగింది!

"మీరన్న మాటలు యదార్థమే! ఏమైనా ఉన్నతపాఠశాల యిక్కడ ప్రతి ఒక వ్యక్తికీ అవసరంగా వుంది. ప్రతీ కుటుంబం నుంచీ-ఒకళ్ళో యిద్దరో చదువుకోటానికని వూరు గూరు వెడుతున్నారు. అటువంటప్పుడు-మన గ్రామంలో నిర్మించబోయే పాఠశాలకు-వారికి శక్తి ననుసరించి సహాయపడరంటారా?" అన్నారు శ్రీమన్నారాయణగారు అమాయకంగా!

"అయితే మీ రనేది ఏమిటి?"—రంగనాథరావుగారు ప్రశ్నించారు

"పాఠశాల కావాలని చాలామంది తల్లి తండ్రు లంటున్నారు కనుక...మనం తల్లి తండ్రుల సభను యేర్పాటు చేద్దాం... దానికి-పెద్దల్ని-అంటే కేశవరాయలుగారూ (ఆయనే దేవాలయ నిర్మాణానికి ప్రోగు చేసిన ఏభై వేల మీదా అజమాయిషీ చేస్తున్న పెద్ద)-శేషప్పగార్నీ (ఆయనే దేవాలయ నిర్మాణం కేశవరాయలుగారు చేయకూడదనే పెద్దఖామందు) పంచాయతీ సభ్యుల్నీ యితర పెద్దల్నీ ఆహ్వానించుదాం. వారంతా సభలో యిచ్చిన సలహాల ప్రకారం ముందు కార్యక్రమం నడుస్తుంది"—అంటూంటే యెవరో పేషంటు ఆస్పత్రిలోకి వచ్చాడు.

లోపల పనిచూసుకుంటున్న కాంపౌండర్ను పిలచి, రంగనాథరావుగారు దృష్టిని మార్చుకుంటూ "సరే—అంతా మీయిష్టం. ఎలా చేయాలని తోస్తే మీరాలా చేయండి నాకీవూరు మనుషుల మీద యే మాత్రం నమ్మకంలేదు. ఊరికే వస్తే అంతా "మాకే కావాలంటారు." ఏమైనా నలుగురతోపాటు నేనూ వుంటాను. సాధ్యమైనంత త్వరలో ఆసభ యేర్పాటుచేస్తే—మనం యేదో ఒకటి తేల్చుకోవచ్చు."— అంటూంటే, శ్రీమన్నారాయణగారు కుర్చీలోంచి లేచి; "ఎన్నో రోజులెందుకూ? రేపల్లుండే సభను యేర్పాటు చేదాం! ఆ ప్రయత్నం అంతా నేచేస్తాను. మీ సహాయం వుంటే యెటువంటి పనయినా సరే ఫలవంతమవుతుంది! తిరిగి మిమ్మల్ని కలుస్తాను"—అంటూ నిష్క్రమించారు!

ఆవూళ్ళో హైస్కూలు రావటానికి ప్రయత్నం చేసిన, చేస్తున్న డాక్టరు రంగనాథరావుగారిలో ఎటువంటి స్వార్థం లేదంటే — మీరాశ్చర్యపోవచ్చు— అది నిజం! అంతేకాదు—ఆయన పిల్లలయినా హైస్కూలు చదువు కావలసిన వాళ్ళు లేరు! కుమారులంతా పెద్ద చదువులు చదువుతున్నప్పుడు డాక్టరు గారు నిజానికి హైస్కూలు స్థాపించటం గురించి కలగజేసుకోవటం అనవసరం! కానీ వూరు బాగుపడాలనీ, అంతా విద్యావంతులవ్వాలనీ—సహృదయంతో వాంఛించే—ఆయన ప్రయత్నం సాగిస్తున్నారు. శ్రీమన్నారాయణగారూ అంతే! సామాన్యస్థితిమంతుడైనఆయనలో—వున్నత పాఠశాల తమ వూళ్ళో యేర్పడితే—తమ పసిపిల్లలు—శ్రమలేకుండా విద్యనభ్యసించవచ్చుననే స్వార్థచింతన మినహాగా యేమీ లేదు! స్వార్థంలేని ఆ పెద్దలిద్దరూ—హృదయపూర్వకంగా సహకరించి—ఆ గ్రామం వున్న స్థితికి అనేక విధాలుగా తోడ్పడ్డారనీ, తోడ్పడుతున్నారనీ—అంతా అనుకుంటూంటారు. అందువల్ల వారి మాటలు సర్వసాధారణంగా చేతలే అవుతూంటాయి

* * *

రెండు రోజులు గడిచాయి...

శ్రీమన్నారాయణగారు ఆ దినం తల్లి దండ్రుల సభను ఏర్పాటుచేసి, యిదివరలో అనుకొన్న పెద్దలందరినీ ఆహ్వానించాడు! విద్య వాంఛించే బిడ్డల తండ్రులూ, పంచాయతీ సభ్యులూ, గ్రామంలో రెండు పక్షాలుగా చీలి, ఆ పక్షాలకు ప్రముఖపాత్ర వహిస్తున్న పెద్దలు—కేశవరాయలు గారూ, శేషప్పగారూ ఇతరులూ ఆ సభకు విచ్చేశారు! సభ నేర్పాటు చేసిన శ్రీమన్నారాయణగారి కోరిక ననుసరించి డాక్టరు రంగనాధ రావుగారా సభకు అధ్యక్షత వహించారు.

డాక్టరు రంగనాధ రావుగారు, తమ వుపన్యాసంలో—పాఠశాల ఆవశ్యకత గురించి, స్థాపించడంలో గల సాధక బాధకాలగురించీ తెలిపి, "గ్రామస్థులైన మీ అందరి యిష్టాన్ననుసరించి—ముందు కార్యక్రమము యేర్పాటు చేదామనుకుంటున్నాం"—అన్నారు.

సభలో సభికులు వుత్సాహంతో "మీరు పాఠశాలను ఏర్పాటు చేయించాలి. ఏ విధముగానైనా సరే"—అని అరచారు. సభికుల వుత్సాహం, డాక్టరుగారినీ, శ్రీమన్నారాయణగారినీ పరవశపరచింది. "మీ పరిపూర్ణ సహకారంవుంటే పాఠశాల త్వరలోనే మన గ్రామంలో వెలుస్తుంది. అంతా శ్రీమన్నారాయణగారు చెబుతారు. మంచి—చెడ్డలాలోచించి మీరొక నిర్ణయానికి రండి" — అంటూ ఆయన కుర్చీలో కూర్చున్నారు. మరో కుర్చీలో కూర్చున్న శ్రీమన్నారాయణగారు ఉత్సాహంతో లేచి పాఠశాల స్థాపన సందర్భంలో తాము చేస్తున్న కృషివివరాలు, విపులంగా తెలియపరచి, "డాక్టరుగారు అధికారుల్ని కలుసుకు వచ్చారు. మన గ్రామంలో కమిటీ పాఠశాల యేర్పాటుచేయవలసి వుంటుంది ... కమిటీ పాఠశాలకు రికగ్నిషన్ యివ్వటానికిగూడా కొన్ని ప్రత్యేక షరతులు పై అధికారులు పెట్టారు! మనకు మనం నూతన పాఠశాలా భవనాన్ని నిర్మించుకోవాలి! నూతనంగా తెరువబడే—కొత్త హైస్కూలు బాలారిష్టాలు దాటి స్వయంపోషకశక్తి పొందే వరకూ మూడుసంవత్సరాలలోనూ అవసర ఖర్చులకోసం — కొంతడబ్బు బ్యాంకులో నిలువచేయాలి! మేం లెఖ్ఖ వేసి చూశాం! పాఠశాలా భవనానికి కనీసం పాతిక వేలవుతాయి; పాతిక వేల పైచిలుకు—మూడు సంవత్సరాలలోనూ ఖర్చవుతుంది. అందువల్ల

ఆ యేభైవేల మొత్తం మనం యేవోవిధంగా సమకూర్చినపక్షంలో — పాఠశాల త్వరలోనే ప్రారంభించబడుతుంది. పెద్దలు — తల్లితండ్రులూ అంతా యీ సభకు విచ్చేశారు...ఈ డబ్బు పోగుచేసేపూచీ మనది! సీతారాములు వెలసినప్పుడు — అంతా ఆవేశంతో మూడుసంవత్సరాలకాలం చందాలు చెల్లించారు. ఏభైవేలవరకూ వసూలుచేసారు! అటువంటి భక్తులూ, వుత్సాహవంతులూ, తలుచుకుంటే — మరి లేనిదేమిటి? దేవుడికి దేవాలయం యెటువంటిదో — విద్యార్థులకు విద్యాలయం అటువంటిది. దేవాలయం నిర్మించటానికి మీ రే విధంగా సహాయపడ్డారో — అదేవిధంగా మాకు చేయూత నివ్వాలి! రామాలయ నిర్మాణానికి చందాలు వసూలుచేయటానికి మూడు సంవత్సరాల కాలం పట్టింది! అంత దీర్ఘకాలం దీనికి కుదరదు; ఆ మొత్తం ఎంత త్వరగా మనం సమకూర్చితే అంత త్వరలో పాఠశాల ప్రారంభించే యేర్పాటుచేయటానికి వీలుంటుంది...సభ్యులా మొత్తం, సమకూర్చటానికి మీ విలువైన — సలహాల నివ్వండి" అన్నారు!

డబ్బు సంగతి యెత్తేసరికి — సభికులు చాల సేపటి వరకూ మాట్లాడలేదు. ఒకళ్లి నొకళ్ళు చూసుకొన్నారు. "మా పిల్లలైతే బడికి పంపగలం కానీ — బడి కట్టడానికి మేము డబ్బు యెక్కడ ఇవ్వగలం" అనుకొన్నారు కొందరు సామాన్య స్థితిమంతులు! "ఊళ్లో పిల్లలు చదువుకోటానికి — బడి కట్టించట మేమిటే! వాళ్లకోసం మేం చందాలివ్వట మేమిటే?" అని తలబోశారు మరికొంతమంది భాగ్యవంతులు! "దగ్గర డబ్బు లేకపోతూంది కానీ — వుంటే యింతకంటె మంచిదానం మరేం వుంది? తప్పకుండా సహాయపడుదుం" అని భావించారు కొందరు బీదవాళ్ళు. ఏమయితే నేం — సభికులలోంచి యెటువంటి చలనమూ లభ్యం కాలేదు! విరోధులైన కేశవరాయలు గారూ, శేషప్పగారూ మాత్రం ఒకరివయిపు మరొకళ్లు ఎందుకో వూరికే చూసుకొన్నారు.

అధ్యక్షునిస్థానంలో కూర్చునివున్న రంగనాథరావుగారిలో నిరుత్సాహం ఏర్పడింది ఆయన అంతక్రితం భావించినట్లుగానే — ప్రస్తుతం జరుగుతూంది. "ఆయన మరి దారి ఏమిటీ" అన్నట్లుగా శ్రీమన్నారాయణగారి వంక చూశారు!

శ్రీమన్నారాయణగారు, తిరిగి వేదికదగ్గరకు వచ్చి-ఏదో చెప్పబోతూన్నట్లుగా కన్పించిన శేషప్పగారివంక చూసి "అదేమిటి శేషప్పగారూ! అలా కూర్చుండిపోయారు. మీకు తోచినవిధంగా రెండు మాటలు చెప్పి-డబ్బు వసూలయే మార్గం చూడండి." అన్నారు!

శేషప్పగారు, వేదిక దగ్గరకు వచ్చి: "సోదరులారా! ఈవూరికి ఉన్నతపాఠశాల చాలా అవసరం! మనపిల్లలు ప్రతినిత్యం మూడుమైళ్ళదూరానవున్న పొరుగు వూరు బడికి వెళ్ళి చాలా బాధ పడుతున్నారు. పెద్దలూ, పూజ్యులూ అయిన శ్రీ రంగనాథరావుగారిచేతులో ఆమొత్తాన్న వుంచిన పక్షంలో-కొద్ది రోజుల్లోనే పాఠశాల ఏర్పాటుచేయబడుతుంది. దినదినానికీ అభివృద్ధిపొందుతున్న-మనవూరికి బడి ఎంతైనా అవసరం! అయితే ఏభై వేల రూపాయలు కావాలి. ఆమొత్తం ఒక్కసారిగా కావాలి! ప్రస్తుతం ఆమొత్తాన్ని మనం యివ్వలేం" ఆలోచించగా, ఆలోచించగా నాకు ఒక్క వుపాయం తోచింది..." అని ఆగాడు.

"ఆవుపాయం యేదో చెప్పండి-" అని సభికులు అరచారు! శేషప్పగారు విరోధి అయిన కేశవరాయలుగారు తనవయిపు తీవ్రంగా చూస్తూంటే, యీలా ప్రారంభించాడు: "మనగ్రామంలో వెలసిన సీతారాముల ఆలయ నిర్మాణంకోసం ఏభైవేల రూపాయలు వసూలుచేసి — బ్యాంకులో జమచేసి వుంచాం! వడ్డీ మినహాగా — మనకు దానివల్ల యెటువంటి లాభంలేకుండా వుంటోంది! నాదొకసలహా! సీతారాముల ఆలయ నిర్మాణంకోసం — ఉత్సవంచేయటం కోసం ప్రోగుచేయబడిన ఆ మొత్తాన్ని — పెద్దల అధీనంలోవుండే స్కూలుకమిటీ యెందుకు యిప్పుడు తీసుకొని — వుపయోగించుకోకూడదు? పైఅధికారులు — స్వశక్తిచేత పాఠశాల నడవదేమోననే కారణంచేత పాతికవేలు నిలువచూపమంటు



# రామభక్తుడు



న్నారు! ఆ మొత్తం నిలువచూపించవచ్చు. ఇక్కడనుంచి—పొరుగూరు బడికి వెళ్లే పిల్లలు రెండువందల పైచిలుకు; అలాగే మనవూరుమీదుగా పొరుగు గ్రామాలనుంచి వెళ్ళేవాళ్లు మూడువందలమంది! ఇక్కడ బడి తెరవబడిన పక్షంలో ఆ అయిదువందల విద్యార్థులు యిక్కడివాళ్లవుతారు! అంతే కాదు! కొత్తగాచేరే విద్యార్థు లుంటారు. అందువల్ల—విద్యార్థుల జీతాల మూలకంగా పాఠశాల స్వశక్తిమీద ఆధారపడ కలుగుతుంది! అప్పుడు—డబ్బుతీసుకొని, యిష్టమొచ్చినట్లుగా దాన్ని సద్వినియోగ పరచవచ్చు"—అంటూ దిగిపోయాడు!

"బాగుంది "బాగుంది! అలా కానివ్వండి"—అన్నారు సభికులు చప్పట్లు చరచి. కేశవరాయలుగారు శేషప్పగారి వంకా, శ్రీమన్నారాయణగారి వంకా తీవ్రంగా చూశాడు! ఆవిధంగాచేయటం ఆయనకిష్టం లేదు. కానీ సభికులు తాత్కాలికావసరాలకోసం అటు వయిపు మొగ్గుతున్నారు! ఇటువంటప్పుడు తానేం చేయకలుగుతాడు?

అధ్యక్షస్థానంలో కూర్చునివున్న రంగనాధరావుగారికేదో ఆలోచన కలిగింది. ఆయన చిన్న కాగితంమీద యేవో అంకెలు వేసుకొని, "బాగానేవుంది"— అనుకొని. క్రిందనున్న కేశవరాయలుగారి వంకచూసి; "ఏం కేశవరాయలుగారూ మీ అభిప్రాయం యేమిటి?"—అని అడిగారు!

"తర్వాత తీసుకోవచ్చు...ముందు బడికి యిచ్చితీరవలసిందే" అని సభికులు అరుస్తూంటే, వేదికదగ్గరకు వచ్చిన ఆయన తగ్గిపోతూ!" మధ్యనాదేం వున్నదికనుక? డబ్బు యిచ్చింది ప్రజలైనమీరు! ఇప్పుడు అడుగుతున్నదీ మీరే! ఒకప్పుడు మీరు యిచ్చింది దైవకార్యానికి. తిరిగి యిప్పుడు కావాలంటున్నది—విద్యాలయ వుపయోగానికి! అంతా మీ అందరి యిష్టమూ! భద్రాద్రి రాముని ఆలయాన్ని రామదాసు బాగు చేయించాడు. ఆలాగే మన దేవాలయాన్ని కూడా- ఆలస్యమైనా— నాబోటి స్వలాభపరులచేత కాకుండా ఒక రామభక్తుని అజమాయిషీలో నిర్మాణం చేసేప్రయత్నం చేయండి! ఉత్సవం జరిపించండి. అదే నా కోర్కె...ఆ డబ్బు-డాక్టరు గారి లాంటి పెద్దల—అధీనంచేయటానికి— నే సిద్ధంగా వున్నాను. ఆ మొత్తం ముట్టినట్లుగా నాకు తిగురసీదు లివ్వండి"—అంటూ ఆయన దిగిపోయాడు!

సభికులు కేశవరాయలుగారికి జేజేలు కొట్టారు! శేషప్పగారు తెల్లబోయాడు!

రంగనాధరావుగారు తమ అంత్యోపన్యాసంలో: "రామచంద్రుని ఆలయ నిర్మాణానికి చందాలద్వారా వసూలుచేసిన ఆ మొత్తాన్ని పాఠశాల కుపయోగించటం న్యాయంగా నాకు తోచటంలేదు. అయితే ఉన్నత పాఠశాల ప్రతీవారూ వాంఛిస్తున్నారు. ఆకారణంచేత-మీ అందరి యిష్టాన్ననుసరించి కేశవరాయలుగారిద్వారా బ్యాంకులో నిలువయున్న మొత్తం రెండు మూడురోజుల్లో తీయించి-పాఠశాల ప్రారంభించటానికి ప్రయత్నాలుసాగిద్దాం. శేషప్పగారన్నట్లుగా-అయిదు వందల విద్యార్థులు మన పాఠశాలలో ప్రవేశం పొందినపక్షంలో అది అచిరకాలంలోనే స్వయంపోషక పాఠశాల అవగలదు. అప్పుడు-రామచంద్రుని దేవాలయానికిగాను వసూలయిన మొత్తాన్ని తీసి-దానికుపయోగించవచ్చును"-అన్నారు. శ్రీమన్నారాయణగారి, వందన సమర్పణంతో-సభ ముగిసింది. ఆ తరువాత నాలుగు రోజులు గడిగాయి.

* * *

ఆ దినం-వుదయం ఎనిమిది గంటల వేళ...

డాక్టరు రంగనాధరావుగారి ఆస్పత్రికి-ఏబదివత్సరాల వయస్సుకల ఒకాయన వచ్చారు. వేషభాషల మూలకంగానే కాదు-ముఖవర్చస్సు మూలకంగానూ, ఠీవిచేతా-ఆయన గొప్పయింటి వ్యక్తిగాను, భగవద్భక్తులుగానూ కన్పించారు.

రంగనాధరావుగారు చేతులో పని పూర్తి చేసుకొని: "ఎవరు మీరు? ఎందుకు వచ్చినట్లు?"-అని ప్రశ్నించారు.

"మాది యిక్కడికి ముప్పై మైళ్లదూరాన వున్న పాలెం. నాపేరు నారాయణరావు. ఆ రామచంద్రుడి దయవల్ల నాకేదో యింత ఆస్థి వుంది! యిక్కడ సీతారాములు వెలసారని నాకు నాల్గు సంవత్సరాల క్రితమే తెలుసు. వెలసిన కొత్తలో ఆ దివ్య మంగళ విగ్రహాలను చూట్టానికి నే వచ్చాను! అప్పట్లో నే తమ దర్శనం చేసిందిలేదు. ఈ పట్టణ ప్రజలు దేవాలయం కట్టడానికి చందాలు వసూలు చేస్తున్నారని తెలిసి నాకు నేను గూడా—నా శక్తినిబట్టి సహాయ పడదామని అనుకొన్నాను! కానీ మీ తలంపులు ఏభై వేలవరకూ చందాలు వసూలు చేయటంతోటే-కారణాంతరాలవల్ల ఆగిపోయినట్లు విని చాలా విచారించాను. మీకు సమయం సానుకూల పడినప్పుడే సహాయ పడదామని యింతవరకూ వుపేక్షించాను! కానీ మీరంతా—ప్రస్తుతం తలంపులను పూర్తిగా మార్చుకొన్నారట. రామచంద్రుల ఆలయ నిర్మాణానికీ—ఉత్సవాలకొరకూ ప్రోగు

(53-వ పేజీ చూడండి)




నేను కొత్తగా సబ్ ఇన్‌స్పెక్టరుగా చేరిన రోజులవి. పగలల్లా 'రాంగ్ సైడ్' రాత్రల్లా నోలైట్, తప్పితే 'న్యూసెన్స్' కేసులూ కంటే పెద్దకేసులు పట్టుకున్న మొహాలు కారేమో, మాపోలీసు బృందం, నేను రాత్రి చదివి పూర్తిచేసిన అగథాక్రిస్టి నవలలో కథా సారాంశం, డిటెక్టివ్ పోయిరేట్ సూక్ష్మబుద్ధిని గురించి ఉపన్యసిస్తుంటే చెవులు రిక్కబొడుచుకుని, గుడ్లప్పగించి, తెల్లమొహాలు వేసి వింటున్నారు.

"ఖూనీచేసినవాణ్ణి పట్టాలంటే...అలాంటి తెలివుండాలి కావండి...ఈ కత్తులూ, ఈ కుపాకులూ వుండేంలాభం!" అన్నాడు మాహెడ్ కానిస్టేబుల్ వెంకటస్వామి, కథలో డిటెక్టివ్‌ను అభినందిస్తూ.

'సమయంరానీ చూపెడతా నాతఢాకా' అని మనస్సులో అనుకుని, ఎందుకయినా మంచిదని, "ఇంతకీ అదంతా కల్పితం... కేవలం ఊహించి రాసింది" అని పైకి అన్నాను.

"ఏమిటిబావా...ఏదో ఊహా, కల్పనా అంటున్నావు," అంటూ ప్రవేశించేడు మాబావ మధు.

"అబ్బే! నువ్వురాస్తున్న 'సైకాలజీ ఆఫ్ ది క్రిమినల్'కి సంబంధించిన కొన్ని అంశాలు మావాళ్లకి చెబుతున్నా లే. అన్నాను.

"అయినా అది నీకు చదివి వినిపించటం నాదే పొరపాటు. ఇంతకీ నేను రాస్తున్నవి ఊహాలో, సిద్ధాంతాలో అవకాశం దొరికితే నిరూపించి చూపెడుదును. ప్రభుత్వం ప్రకటించిన లెఖ్ఖల ప్రకారం సంవత్సరానికి దగ్గిరదగ్గిర తొమ్మిదివేల ఖూనీలు మనదేశంలో జరుగుతున్నాయి. అంటే ఇంచుమించు రోజుకు పాతిక. నువ్వు స్టేషన్ ఛార్జి తీసుకుని రెండునెల లయ్యింది... చెప్పుకుంటే సిగ్గు...నీ అధికారప్రాంతంలో మచ్చుకయినా ఒక్కఖూనీజరగలేదు, పోనీ హత్యారహస్యం ఛేదించి హంతకుణ్ణి నీకప్పగించి నా సిద్ధాంతాల్ని నిరూపిద్దామంటే."

మధు మా మేనత్తకొడుకు. యూనివర్సిటీలో 'సైకాలజీ' లెక్చరర్. స్వతహాగా చాలా తెలివైనవాడు. కాని డిటెక్టివ్ సాహిత్యంతో బుర్రవేడెక్కి ఈ మధ్య కొన్ని కథలుకూడా రాసి పత్రికలకు పంపించటం, తత్ఫలితంగా ఋణమో పణమో అందుకోవటం జరుగుతూంది. దానాదీనా, దొంగతనాలూ, ఖూనీలుచేసే నేరస్థుల మనస్తత్వాలమీద ఓ గ్రంథం గానేసి దేశాన్నుద్ధరించాలన్న ధోరణిలో పడ్డాడు.



# మిత్రద్రోహం



"నీలాంటి ఉద్యమ స్యులు బలవంతంగా మేమిక్కడికి తీసుకొస్తే కాని రారే. నువ్వేమిటి ప నీ అంతట నువ్వే ఇలా వొచ్చేశేవు?" అన్నాను.

"ఏదో ఇలారావడం అలవాటు చేసుకుంటే రేపొద్దున్నెప్పుడైనా బలవంతంగా ఈ స్టేషన్‌కి రావల్సి వచ్చినా, అప్పుడంత కొత్తనిపించదు...ఆ...సరేకాని టిక్కెట్లు దొరకడం కష్టంగా వుందిట. ఇవ్వాళ మొదటి ఆట చరణదాసికి నాకో ఎనిమిదిటిక్కెట్లు ..."అని మధు ఏదో చెప్పబోతున్నాడు. ఇంతట్లోకే 304 ఒక పిడుగువంటి శుభవార్త తీసుకొచ్చాడు.

పక్కనే నాలుగుమైళ్లు దూరంలోవున్న పద్మాపురం అనే గ్రామంలో రెండు ఖూనీలుజరిగేయిట. అవూరి కరణంగారే స్వయంగా ఈకబురు తీసుకొచ్చేరు. వద్దు వద్దు అంటున్నా వినకుండా మధుకూడా మాతోబాటు జీప్ ఎక్కేడు. కొంత దూరం వెళ్ళేక, కరణంగారు చెప్పడం మొదలెట్టేరు. "రంగూన్ టెయిలరింగ్ హోమ్" అని పేరు పెట్టుకుని ఇంట్లోనే బట్టలు కుట్టుకుంటూ ధర్మయ్యనే ఒక ఆసామీ చాలా మర్యాదగా మావూళ్ళో కాలక్షేపం చేస్తున్నాడండి. నిన్నరాత్రి అతను ఇంట్లో లేకుండాచూసి, అతని పెళ్ళాన్నీ, పదిహేనేళ్ళగా అతనితోటే వుంటున్న అతని స్నేహితుడు సీతన్ననీ ఎవరో ఖూనీచేసి ఆసీతన్న తాలూకు ఐదారువేల రూపాయల విలువచేసే డబ్బూబ్దస్కం దోచుకుపోయేరండి."

"ధర్మయ్య ఎక్కడికెళ్ళేడు"

"శేషయ్యనే మరో స్నేహితుడితో కలిసి విశాఖపట్నం వచ్చి మొదటాట చరణదాసి, రెండో ఆట పెంకిపెళ్ళాంకి వెళ్ళేరుట. రెండో ఆట సగంలో తలకాయినెప్పి వొచ్చిందని చెప్పి శేషయ్య ఇంటికి తిరిగి వచ్చేస్తుంటే, సరిగ్గా ఈ మలుపులోనే... బాబూ జీప్ కొంచెం ఆపించండి.

జీప్ ఆగింది. అందరం దిగేం. అక్కడ నుంచి పద్మాపురం గ్రామం ఇళ్ళు దూరంగా కనబడుతున్నాయి. రోడ్ ప్రక్కనే చెరువుంది. చెరువు కవతలగట్టున రెండు చిన్న పెంకుటిళ్లు కనబడుతున్నాయి. కుడి ప్రక్క ఇల్లు ధర్మయ్యదట. ధర్మయ్య యింటికి కుడివైపునన్నీ పొలాలే. ఎడమ ప్రక్క సుమారోయాభైగజాల దూరంలో ఉన్న రెండో ఇల్లు చలమయ్యనే రైతుది. చలమయ్య ఇంటి దగ్గరనుంచి ఎడమవైపుకో ఫర్లాంగు నడిస్తేనేకాని, మిగతాయిళ్లన్నీ వున్న పెద్దవీథి తగలదు. ధర్మయ్యింటికి వెనకవైపున సుమారొక ఫర్లాంగుదూరంలో ఓ ఇల్లు తాలూకు ప్రహారీగోడ, దాని ప్రక్కనే దేవాలయం కనబడుతున్నాయి. ఈ రోడ్ మలుపునుంచి పొలాల కడ్డంపడి నడిస్తే ధర్మయ్యిల్లు సుమారో నూరుగజాల దూరంలో వుంటుంది. ఈ తబిసీళ్లన్నీ మాకుచెప్పేక మళ్ళీకరణంగా రిలాఅన్నారు: "ఇక్కడికి రాగానే సినీమానుంచి ఇంటికి తిరిగివస్తున్న శేషయ్యకి ధర్మయ్యింట్లో నుంచి కేకలు వినబడ్డాయిటండి. అటుతిరిగి చూస్తూంటే, ధర్మయ్యింటి వెనకవైపునుంచి ఒకమనిషి పరిగెత్తుకుంటూ ఆ ప్రహారీ గోడ వైపు పారిపోతున్నట్టు కనబడిందిటండి. తక్షణం శేషయ్య తనింటికెళ్లడం మానేసి ధర్మయ్యింటికి పరిగెత్తుకువెళ్ళి, తలుపులు తెరిచివుండటంవల్ల సరాసరి లోపలికెళ్ళి చూస్తే సీతన్నశవం, ధర్మయ్యపెళ్ళాం సింగారిశవం కనబడ్డాయిటండి. బయిటకొచ్చి పక్కింటి చలమయ్యని ఊళ్ళోకి పంపి, పదిమంది మనుషుల్ని పోగుచేసుకు రమ్మన్నాడట. అందరూ వచ్చినతర్వాత శేషయ్య చెప్పినవైపున పరుగెత్తి వెతికేరు కాని, అప్పటికప్పుడే వాడెవడో పారిపోయేడు." అని పూర్తిచేశారు.

"అటుపరిగెత్తిన వాడెక్కడికెళ్ళగలడు?"

"ఆలయం పక్కసందులోంచి వెడితే పెద్దవీథిలోకి దారివుందండి."

"ఆ కనపడే ప్రహారీగోడ ఎవరియింటికి చెందింది?"

"కనకయ్యశెట్టి అనే షావుకారుదండి."

జీప్ అక్కడే ఆపేసి, పొలాలకి అడ్డంపడి నడిచి అందరం ధర్మయ్యింటికి చేరుకున్నాం. ఆ అరుగుమీదే కూర్చున్న ధర్మయ్యని శేషయ్యనీ అక్కడ ఓదారుస్తున్న అవూరి పెద్దల్ని కరణంగారు పరిచయంచేసేరు.

వీధితలుపు తీసి లోపలిహాల్లో ప్రవేశించగానే మొదట నాదృష్టి గడియమీద పడింది. గడియ దూరవల్సిన రింగు వంగిపోయి కొంచెం ముందర కొచ్చేసివుంది. ఆ రింగు దగ్గర్నుంచి తలుపు చివరఅంచువరకూ గడియరాపిడివల్ల తలుపు చెక్క కొట్టుకుపోయివుంది. బయిటనుంచి తలుపు బలవంతంగా ఒక్కసారి తోసి తెరిచినట్టు స్పష్టంగా తెలుస్తుంది. హాల్లో కుడివైపున మంచంమీద జంబుకానా, దానిమీద ఓదుప్పటి తలగడా వున్నాయి. వాటిమీద సీతన్న మృతకళేబరం వుంది. కంఠంలోనూ గుండెల్లోనూ ఘోరంగా పొడిచినట్టు రక్తం చిమ్మిన గాయాలున్నాయి. ఈ గాయాల నుంచి స్రవించినరక్తం జంబుకానావరకూ యింకి రెండు పెద్దడాగులు కట్టింది. మెడ కిందవున్న భాగం తలగడా అంతా రక్తమయమయివుంది. అతనికుడికాలు మడమ పక్కకి తిరిగి పాదం వంగిపోయివుంది. అది అతనికి చాలాకాలంగావున్న సొట్టకాలని తెలిసింది. హాల్లోనే ఆ మంచం పక్కనే ధర్మయ్య కుట్టుకునే సింగర్ మిషన్ వుంది.

హాల్లోంచి కుడివైపునున్న గదిలోకి వెళ్ళేం. అంత భయంకరమైన దృశ్యం నేను చూడటం అదే మొదటిసారి. నాబుజంమీద నుంచి మధు బెదురుచూపులు చూసి వెనక్కి వెళ్ళిపోయి సరాసరి వీధిఅరుగు మీద కూర్చున్నాడు. అది ధర్మయ్య పడకగది. అందులోవున్న పాతపందిరపట్టె మంచంమీద ధర్మయ్యభార్య సింగారిశవం పరుపుకు ఐమూలగా పడివుంది. జుట్టు మంచంమీదనుంచి కిందకి వేళ్ళాడుతూవుంది. సింగారి శరీరం పొడుగునా నాలుగుచోట్ల దారుణమైన గాయాలున్నాయి. రక్తం మంచంమీదే కాకుండా గది నాలుగుమూలలా చిమ్మి పక్కనున్న నేలమీద మడుగులుకట్టింది. మంచంకోడు దగ్గరే బట్టలు కత్తిరించే పెద్ద కత్తెర రక్తపూరితమై పడివుంది. గాయాలకేసి

చూస్తేచాలు ఆ కత్తే హత్యాయుధం అనడానికి వేరే ఆధారం అక్కర్లేదు.

సింగారి వయస్సు సుమారు పాతిక సంవత్సరాలుంటాయి. చక్కటి వంపులు తిరిగిన శరీరం. పెద్దకళ్లు. ఒక్కక్షణం ఆ మొహంలోకి చూస్తూ హంతకుణ్ని ఉరికంబమెక్కించి ఆమె తరఫున పగసాధించడానికి మనస్సులోనే శపథం చేసుకున్నాను.

ఆమంచంకిందనే సీతన్నకు చెందిన ట్రంకు పెట్టెతాళం బద్దలుకొట్టి వుంది. అందులో బట్టలన్నీ చిందరవందరగా పడి వున్నాయి. ట్రంకుపెట్టె బయట ఒక చిన్న కర్రపెట్టె తెరిచి పడివుంది. ఆ చిన్న కర్రపెట్లో ప్రోమిసరీనోట్లు వ్రాయటానికి కావల్సిన స్టాంపుకాగితాలూ, రెవిన్యూస్టాంపులూ తప్ప ఇంకేమీ లేవు. అందులోనే సీతన్న డబ్బు, అప్పు పత్రాలూ దాచేవాడుట. అవన్నీ దొంగిలించబడ్డాయిట.

ఆ గదిలోంచి వంటింట్లోకి వెళ్లి చూసేం. రెండు మూడు చోట్ల రక్త బిందువులు కనబడ్డాయి. వంట ఇంట్లోంచి దొడ్డివైపుకు వున్న తలుపు తెరిచేవుంది. అది తెరచుకుని అందులోంచే హంతకుడు పారిపోయి వుండాలి.

హంతకుడు ఆచూకీ కనిపెట్టడానికి సహాయపడే ఆధారాలింకేమీ అక్కడ కనబడలేదు. వేలుముద్రలు తియ్యటానికి కావల్సిన పరికరాల్ని, శవపరీక్ష చెయ్యటానికి డాక్టర్ని, హత్యాన్వేషణకుపయోగపడే ప్రదేశాల్ని వస్తువుల్ని ఫోటోలు తియ్యటానికో ఫోటోగ్రాఫర్ ని తీసుకురమ్మని జీప్ మీద కానిస్టేబుల్ ని పంపించేను. ధర్మయ్యింట్లో ఎడమవైపునవున్న గది కాళీచేసి అందులో రెండుకుర్చీలు మాకు వేసేరు.

ధైర్యంగా వుండి మాకు సహకరించవల్సిందని ఓదార్పు మాటల్తో ధర్మయ్య వాఙ్మూలం తీసుకున్నాను.

నే: రాత్రి నువ్వెక్కడున్నావు? ఈ హత్య సమాచారం నీ కెప్పుడు తెలిసింది? నువ్వు ఎప్పుడు ఇక్కడికి తిరిగివచ్చేవు?

ధ: రాత్రి రెండో ఆట చూసి సత్రవులో పడుకున్నానండి. రాత్రి మూడుగంటలా ప్రాంతంలో శేషయ్య తిరిగొచ్చి నాకు చెప్పేడు. ఇద్దరం కలిసి తెల్లారేటప్పటికి ఇక్కడికొచ్చేసేమండి.

ధర్మయ్యను పంపించేసినతర్వాత శేషయ్యని పిలిపించేను. కరణంగారు మాకు దార్లో చెప్పినదేదు. చ. తప్పకుండా చెప్పేడు.

నే: మీరిద్దరూ కలసి ఇలా సినిమాలకెళ్ళే రివాజు ఇదివరకునుంచీ వుందా?

శే: ఉందండి. వెళ్లినప్పుడల్లా రెండాటలూ చూసి, రాత్రి టర్నర్ సత్రవులో పడుకుని మర్నాడు పొద్దున్నే బజారుపని చూసకుని మధ్యాన్నానికింటికొచ్చేస్తూ వుంటాం.

నే: ఆటమధ్యలో వచ్చేసేటంత తలనొప్పికి కారణం-సినీమా అంత బాగుండటం వల్లనా, లేకపోతే, వంట్లో స్వస్థత చాలకనా?"

శే: రెండూనండి.

"నువ్వు రాత్రి రెండోఆట సగంలో వచ్చేసినప్పుడు అవుట్ పాస్ తీసుకున్నావా?" అని అడిగేడు మధు.

"చిత్తం...ఇదిగోనండి" అంటూ జేబులోంచి తీసి అవుట్ పాస్ నాచేతి కిచ్చేడు శేషయ్య.

తర్వాత పక్కింట్లో కాపరముంటున్న చలమయ్యని పిలిచేను.

నే: నిన్నరాత్రి యింత గొడవ జరిగితే మీకు తెలియలేదా?

చ: తెలియకేం బాబూ...ముందర పెద్ద శబ్దమయిందండి. మెళుకువొచ్చి అదేంటో అని ఆలోచించేవేళకి ధర్మయ్యింట్లోంచి కేకలు వినబడ్డాయండి. బయట కొచ్చి చూస్తే అంతా చీకటి. ధర్మయ్యింటి వేపు పదడుగులేసి "సీతన్న బావా" అని పిలిచేనండి. జవాబు లేకపోవడంతోటే మళ్లీ యింట్లోకొచ్చి లాంతరు వెలిగించుకుని చేతికర్ర పుచ్చుకుని బయటకొస్తుంటే, ధర్మయ్యింటి మెట్లు శేషయ్యెక్కుతున్నాడు. నేను ధర్మయ్యింటిదగ్గర కొచ్చేప్పటికి శేషయ్య ఇంట్లోంచి బయటకొచ్చి...ఖూనీ జరిగిందని చెప్పి నన్ను ఊళ్ళోకెళ్ళి మనుషుల్ని తీసుకురమ్మని పంపించేడు."

నే: "రెండోసారి నువ్వు బయిటకొచ్చినప్పుడు ధర్మయ్యయింటి మెట్లెక్కుతూ శేషయ్య నీకు కనపడ్డాడు. మొదటిసారి బయట కొచ్చినప్పుడు, నీ కెవరూ కనబడలేదు. అవునా?"

చ: చిత్తం.

నే: శేషయ్య నీకు కనబడే ముందర కాని, తర్వాత నువ్వు మనుషుల్ని పోగేసుకుని వచ్చేలోగా కాని ధర్మయ్యింటికి ఎవరెళ్ళింది, ఏం జరిగింది నీకు తెలీదు?

చ: చిత్తం.

నే: శేషయ్య ఖూనీ జరిగిందని చెప్పినప్పుడు నువ్వు ధర్మయ్యయింట్లోకెళ్లి చూడలేదు కదూ?

చ: లేదండి.

మధు: సింగారి ఎలాంటి మనిషి?

చ: నాకు తెలీదండి.

మధు: చాలా మంచి మనిషని నిశ్చయంగా చెప్పలేనంటావు.

చ: నాకు తెలీదు బాబూ.

మధు: వరసకాని నీకూ శేషయ్యకీ ఏమైనా చుట్టరికం వుందా?

చ: ఉందండి. శేషయ్య మా ఆవిడికి మేనత్తకొడుకు.



# మిత్రద్రోహం



మధు : తరచు మీ ఇంటికొస్తూ వుంటాడా?

చ : ఎందుకు రాడండీ! ధర్మయ్యింటికొచ్చినప్పుడల్లా మా యింట్లో పలకరించి వెడుతూనే వుంటాడు.

చలమయ్య బయటికి వెళ్ళిపోయేక "ఓసారి చలమయ్య భార్యనికూడా రమ్మని కబురుపెట్టు" అన్నాడు మధు. "అంత చూడాలని వుంటే వెళ్ళి చూసిరా" అన్నాను. ఇంతలో కరణంగారు లోపలికి రాగానే, తన కుర్చీ ఖాళీచేసి ఆయనకిచ్చి మధు బయిట కెళ్ళేడు.

నే : ధర్మయ్య సింగారి సీతన్న—రంగూన్‌నుంచి వచ్చేరుకదా - వీళ్ళ పుట్టుపూర్వోత్తరాలు మీ కేమైనా తెలుసా?

క : అవన్నీ ధర్మయ్యే యీ వూరు రాగానే చెప్పేడు అందరికీ. పదిహేను సంవత్సరాల క్రితం రంగూన్‌లో ధర్మయ్యకీ సీతన్నకీ స్నేహం కుదిరిందిటండి. అప్పట్నుంచీ అన్నదమ్ముల్లాగ ఒకచోట వుంటూ వచ్చేరట. ధర్మయ్యకంటే సీతన్న డబ్బుఎక్కువ సంపాదించేవాడుట. తక్కువ ఖర్చు పెట్టేవాడుట. దానాదీనా ఐదేళ్ళ క్రితం అతని దగ్గిర రెండు మూడువేల రూపాయిల రొఖ్ఖం ఉండీదట. ఆరోజుల్లోనే ప్రమాదవశాత్తూ సీతన్న కాలు విరిగిందట. అది కుదిరేవరకూ సింగారి తల్లిని సీతన్నకు పరిచర్య చెయ్యటానికి ధర్మయ్య ఏర్పాటు చేసేడుట. మధ్య మధ్య తల్లి రావడానికి వీలులేనప్పుడు సింగారే వచ్చి కట్టుకట్టి వంట చేసిపెట్టి పోయీదట. తన కష్ట సుఖాలు చెప్పుగోడంలో సింగారి ఒకసారి ధర్మయ్యతో తన తండ్రి తన్ను పడుపువృత్తిలోకి దిగమని బలవంతం చేస్తున్నాడని తన బ్రతుకు దినదినగండంగా వుందనీ చెప్పుకుందిట. ఆసాయంత్రమే సీతన్నతో సంప్రదించి సింగారిని పెళ్ళాడతానని చెప్పి ధర్మయ్య ఎవరితోటీ చెప్పకుండా మూటా ముల్లీ సర్దుకుని సీతన్నని సింగారినీ తీసుకుని అప్పుడే బయల్దేరబోయే ఓడ యెక్కేసి పారిపోయొచ్చేరటండి. ఇక్కడికొచ్చిన తర్వాత ధర్మయ్య సింగారిని పెళ్ళాడేడు. సీతన్న కాలు సొట్టకాలయిపోవటంవల్ల ఏ పని చెయ్యటానికీ యిష్టపడక తన దగ్గిరున్న డబ్బుతో వడ్డీవ్యాపారం మొదలెట్టి ఈ నాలుగేళ్లలోనూ మొత్తం ఐదారువేల రూపాయల ఆస్తిపరుడయ్యేడండి. ఇప్పుడు ఈ ఇల్లు చలమయ్య దగ్గిరే ధర్మయ్య పేరిట సీతన్నే కొన్నాడు."

నే: ఈ వూర్లో మరో వడ్డీ వ్యాపారస్తు డెవడైనా వున్నాడా?

క : చిత్తం. కనకయ్యశెట్టి అనే అతను వున్నాడండి.

నే: అంటే...ఈ ఇంటి వెనకాల కనబడే ప్రహారీగోడ అతనిదే అన్నారు కదూ?

క: అవునండి.

నే: మరి అటే కదా హంతకుడు పారిపోయేడని శేషయ్యన్నాడు. అక్కడ మీరు వెతికించేరా?

క: వెతికించేమండి. రాత్రి అక్కడ కొందరు వెతుకుతుంటే ఆ అలికిడికి కనకయ్యశెట్టి కళ్లు నులుపుకుంటూ దొడ్డి తలుపు తీసి అందరితోబాటూ తనుకూడా ఆ ప్రాంతమంతా వెతికేడండి.

నే: సీతన్నకి కనకయ్యశెట్టికి ఏమైనా శత్రుత్వముందా?

క: ఏమీ లేదండి. ఉంటే వ్యాపారరీత్యా ఈర్ష్య వుండొచ్చు. ఎంచేతనంటే సీతన్న వచ్చేక కనకయ్యశెట్టి వడ్డీ వ్యాపారం దెబ్బ తిన్నదండి.

నే: పోనీ...ఈ వూళ్ళో సీతన్న దగ్గిర పెద్ద మొత్తాలు అప్పు తీసుకున్న వాళ్ళెవరో చెప్పగలరా?

క: తను ఇప్పుడుంటున్న ఇంటిమీద చలమయ్య పదిహేను వందలు తీసుకుని నిరుడే తన కూతురికి పెళ్ళిచేసేడండి. తర్వాత ఓ వెయ్యి రూపాయిలు ఈయేడే శేషయ్య తీసుకున్నాడు. చవగ్గా తనపొలం సరిహద్దులోనే అమ్మకానికొస్తే దాంతో కొనుక్కున్నాడు. కాని ఈఇద్దరూ అప్పు రెండు మూడేళ్ళల్లో తీర్చేయగల సమర్థులే. మిగిలిన అప్పులన్నీ వందా రెండువందలూను."

తర్వాత ధర్మయ్య శేషయ్యల ఆంతరంగిక స్నేహితుల్ని దర్యాప్తు చెయ్యగా మరి కొన్ని సంగతులు బయటపడ్డాయి.

ధర్మయ్య, శేషయ్యలకి రంగూన్‌లో కూడా స్నేహముండేదిట. ధర్మయ్య రావడానికి రెండేళ్ళ క్రితం, శేషయ్య ఈ వూరొచ్చి భూమికొనుక్కుని స్థిరపడ్డాడు. శేషయ్య రంగూన్‌లో వుండగా కొన్నాళ్లు శేషయ్యని సింగారితండ్రి సింగారినిచ్చి పెళ్ళిచేసేస్తానని నమ్మపెట్టి డబ్బు గుంజేవాడుట. ఇక్కడికివచ్చే నీ ముందర సింగారి తండ్రి మోసాన్ని గ్రహించి వాణ్ణికి నాలుగుతన్ని ఎవరికీ చెప్పకుండా ఇక్కడికి తిరిగి వొచ్చేసేడుట. ఈ వివరాలన్నీ ఇక్కడికొచ్చేక శేషయ్య ధర్మయ్యకి చెప్పేడుట.

రానురాను కేసు అగాథమయ్యేలా కనబడింది. శేషయ్య చలమయ్య కనకయ్యశెట్టి —ఈ ముగురికీ ఈ హత్యవల్ల లాభం కనబడుతుంది. హత్య చెయ్యటానికీ చేయించటానికీ ఈ ముగురికీ అవకాశాలున్నాయి. శేషయ్య ఏం చేసేడో చూసింది చలమయ్య. చలమయ్య ఏం చేసేడో చూసింది శేషయ్య. ఈఇద్దరూ బంధువులు. ఈ యిద్దరూ కూడబలుక్కుని ఈ ఘోరం చేసినా చేసి వుండొచ్చు. పోయిన డబ్బూ ఆ అప్పుపత్రాలూ ఏమయ్యాయో తెలిసేవరకూ ఈ కేసు అంతుదొరకడం కష్టం. ఇలా ఆలోచించుకుంటూంటే మళ్ళీ మధు వచ్చేడు.

మ: చలమయ్యభార్యని కలుసుకువచ్చేను

నే: మంచి పని చేసేవు. ఇంతకీ తన్నులు తినకుండా తిరిగొచ్చేవు. అదే పదివేలు.

మ: సరే కాని...శేషయ్యని ధర్మయ్యని మరికొన్ని విషయాలడగాలి...ఓసారి పిలిపిస్తావా?"

ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయింది. పైగా పోస్టుమార్టెమ్ రిపోర్టు, ఫోటోగ్రాఫర్ వగైరాలూ రాలేదు. ఈలోగా మాబావ మేధాశక్తిని కాస్త చవిచూడొచ్చునని శేషయ్యని రప్పించేను.

మ: హత్యకి సహాయపడటం, హత్యాన్వేషణకి కావాల్సిన ఆధారాలను దాచడం చూసినవి చూడలేదని, చూడనివి చూసేనని అబద్ధమాడటం—ఈ నేరాలకి శిక్షఏమిటో తెలుసా?

శే: చిత్తం. తెలుసండి.

మ: సరే మీరిక్కడ కాస్సేపు కూర్చుని వెళ్లండి.

నాకు అంత చిరాకులోనూ నవ్వొచ్చింది. మా బావ పడ్డశ్రమకి ఫ్లాస్కులోంచి గ్లాసులో పోసి కాఫీ అందించేను. నిశ్శబ్దంగా కాఫీ తాగి సావకాశంగా సిగరెట్ వెలిగించి రెండు దమ్ములు పీల్చి గడియారం చూసుకుని "ఆల్ రైట్ 304 ధర్మయ్యగారిని ప్రవేశపెట్టు" అన్నాడు మధు.

304 ధర్మయ్యని లోపలికి తీసుకొచ్చేక మధు శేషయ్యతో "శేషయ్యగారూ మీ నేరానికి శిక్షతప్పదు ఎటువంటి శిక్షపడేదీ ధర్మయ్య అనుగ్రహంమీద ఆధారపడి వుంటుంది. "మిస్టర్ 304" ఆయన్ని జాగ్రత్తగా బయిటికి తీసుకెళ్లు" అన్నాడు. శేషయ్య ఏదో అనబోతూంటే, మధు కనుసౌంజ్ఞ ననుసరించి 304 శేషయ్యని బయిటికి తీసుకెళ్ళి తలుపు మూసేసేడు.

బయటకెడుతున్న శేషయ్య కేసీ, నాకేసి, మధూకేసి విస్తుపోయిచూసి ధర్మయ్య "దేనికి బాబూ నా అనుగ్రహం?" అన్నాడు.

మ: శేషయ్య తననేరాన్ని ఒప్పుకున్నాడు.

ధ: నేరమంటా!

మ: సీతన్న శవాన్ని ఆ గదిలోంచి హాల్లోకి మార్చడం. నువ్వు తప్పించుకు పారిపోవటానికి సహాయపడటం.



# మిత్రద్రోహం



నిలువునా వువ్వు కూలిపోయినట్టు కూలిపోయి చేతులతో మొహం కప్పుకుని ధర్మయ్య "బాబూ......జరిగిందేదో జరిగిపోయింది. నా కిష్టం లేకపోయినా నన్ను కాపాడదామన్న ఉద్దేశంతో ఇందులో శేషయ్య తలదూర్చేడు. నేనేమయిపోయినా బాధలేదు. శేషయ్యని మాత్రం రక్షించండి" అంటూ భోరున ఏడవడం మొదలెట్టేడు.

హాలో నేను తిరుగుతూ ఆ గది నా చుట్టూ తిరుగుతున్నట్టు నాకంతా అగమ్యగోచరంగా కనబడింది. కళ్లు తుడుచుకుని గొంతు సవరించుకుని ధర్మయ్య చెప్పడం మొదలెట్టేడు. "సంవత్సరంనుంచి శేషయ్య సీతన్నకి పెళ్ళిచేసి నా ఇంట్లోంచి పంపించేసి వేరే కాపురం పెట్టించమని సలహా చెబుతూ వొచ్చేడు. దాంట్లో అర్థం తెలుసుకోలేకపోయేను. నిన్న రాత్రి మొదటాట సినిమాఅయినతర్వాత, మాటల్లో శేషయ్య, సింగారికీ సీతన్నకీ సంబంధం వుందనీ సీతన్న నాకు మిత్రద్రోహం చేస్తున్నాడనీ తేల్చేడు. రెండోఆట సగంలో నేనింక ఉండబట్టలేక, శేషయ్యతో చెప్పకుండా తిన్నగా ఇంటికొచ్చేసేను. మెల్లిగా మా ఇంటి మెట్లెక్కుతుంటే లోపలినుంచి సింగారి సీతన్నల నవ్వులూ కేరింతాలు పడక గదిలోనుంచి వినబడ్డాయి. బలంకొద్దీ తలుపు భళ్లున తెరిచేను. మిషన్ మీద ఎదురుగుండా కత్తెర కనబడింది. అది తీసుకుని పడకగదిలోకి ఒక్క గంతులో వెళ్ళేను. మంచంమీదనుంచి లేవబోతున్న సీతన్నని కసితీరా కత్తెరతో పొడిచేను. పెళ్ళి వొద్దనడం, ఇల్లు నాపేర కొనడం, సింగారికి చీరలు నగలు కొనుక్కోమని డబ్బివ్వటం-ఇవన్నీ ఎందుకో నా కప్పుడర్థమయింది. సింగారి అదురుపడి కేకలెయ్యబోయింది. రెట్టించిన కోపంతో సింగారి జుట్టు పట్టుకుని ఒళ్ళంతా పొడిచేసి చంపేసేను. ఇంకా కత్తెర చేతులో వుండగానే శేషయ్య ఒగుర్చుకుంటూ వచ్చి, ఒక్క క్షణం అలాగే నిలబడిపోయి నన్ను వంటింట్లో వుండమని చెప్పి తను బయటకెళ్ళి చలమయ్యని ఊళ్లోకి పంపించి తను మళ్లీ లోపలికొచ్చేడు. శేషయ్య సలహామీద మేమిద్దరం కలిసి సీతన్న శవాన్ని హాల్లో మంచంమీదికి మార్చేం. తర్వాత పాగా కొయ్య నున్న మరోజత బట్టలు నాకిచ్చి వంటింటి తలుపు తీసుకు పారిపోయి ఊరిబయట కొలను దగ్గర ఒళ్లు కడుక్కుని గుడ్డలు మార్చుకుని తిన్నగా సత్రవు దగ్గరకి పొమ్మని సలహా యిచ్చేడు. మళ్లీ బతుకుమీద ఆశపుట్టి శేషయ్యమాట కాదనలేకపోయేను."

మ: సీతన్న పెట్టె బద్దలుకొట్టి దొంగతనం జరిగినట్టు ఎత్తువేసింది శేషయ్యన్నమాట.

ధ: చిత్తం. తర్వాత రాత్రి మూడు గంటలకి సత్రవు దగ్గర నన్ను కలుసుకుని అన్నీ తను జాగ్రత్త పెట్టేననీ, కేసు గొడవయిన తరవాత డబ్బు మాత్రం నాకిచ్చేసి కాగితాలు మాత్రం తగలబెట్టేస్తానని చెప్పేడండి."

బేడీలు వేయించి ధర్మయ్యని బయటకి పంపించేక మధూతో, "మైడియర్ షెర్లాక్ హోమ్స్...హంతకుణ్ణి ఎలా పసిగట్టేవో నాకింకా అర్థం కాలేదు," అన్నాను.

మ: సింపుల్...మైడియర్ వాట్సన్... వెరీ సింపుల్... నువ్వు ఎక్కడ పప్పులో కాలేసేవంటే, హత్యకీ దొంగతనానికీ సంబంధం వుందనుకోవడం.

నే: ఎందు కనుకోకూడదూ?

మ: దొంగతనం చెయ్యదల్చుకున్నవాడు వీధి తలుపు భళ్ళున తెరిచి లోపలికెళ్ళడు. ఒకవేళ అలా వెళ్ళినాకూడా కత్తో బల్లెమో తీసుకెడతాడు కాని వాళ్ళని చంపడానికి అక్కడ కత్తెర వుంటుందని కలగంటాడా? అసలు కత్తెరతో పొడవడం అంత సులభం కాదు. కత్తెర పట్టుకోవడానికే కొంత అనుభవం వుండాలి. ఇంకోవిషయం-చంపటానికి గుండెల్లోనో కంఠంలోనో పొడిస్తే చాలదూ. ఒళ్ళంతా ఎందుకు పొడవాలి! అందుచేత వీధి తలుపు తెరిచిన పద్ధతి, హత్యాయుధం, హత్యావిధానం కేవలం ఈ హత్య పట్టరాని ఆవేశంలో జరిగిందని చెబుతూనే వున్నాయి.

నే: మరి శవాన్ని మార్చిన సంగతి?

మ: సింగారి పడుకున్న గదిలో గదంతా చిమ్మిన రక్తం హాల్లో చిమ్మలేదేం? కేవలం తలగడా దుప్పటీ జంబుకానా తడిసేయి. అవి గాయాలనుండి కారిన రక్తం డాగులు. పోటు పొడిచిన తర్వాత కత్తెర పైకి లాగెయ్యగానే గాయంనుంచి రక్తం చిమ్ముతుంది. అదీకాక మంచంమీద పక్కనున్న గోడమీద చిమ్మినరక్తం సింగారి గాయాలనుంచి అనుకోవాలి. మరి మంచం బయటచిమ్మిన రక్తం? అక్కడవున్న డాగులూ?

నే: మరి శేషయ్యకి ఎవడో పారిపోయినట్టు కనపడటం...

మ: శుద్ధబద్ధమని కనబడుతూనే వుంది. కేకలు వినపడ్డ మరుక్షణంలో మనిషి పారిపోవడం చూసేనంటాడు కదా. చంపినవాడు పెట్టె బద్దలుకొట్టాలి, అందులోంచి మళ్ళీ క్రమపెట్టి తీసి బద్దలుకొట్టి డబ్బూ కాగితాలూ తీసుకుని వంటింటి తలుపు తెరుచుకుని పారిపోవాలి. ఎంతలేదన్నా హత్య తర్వాత ఐదారు నిమిషాలయినా పడుతుంది. ఈఐదారు నిమిషాలూ శేషయ్య అనుకున్నట్లే నిలబడివున్నట్లయితే, చలమయ్య లాంతరు పుచ్చుకుని ధర్మయ్యింట్లో ప్రవేశించి వుండేవాడు.

నే: అసలెవడో కనబడినట్టెందుకు అబద్ధమాడాలి?

మ: ధర్మయ్యని రోడ్డుపైపు పారిపొమ్మన్నాడుకదా. తర్వాత ఊళ్ళోవాళ్లు వెతకడానికని రోడ్డుపైపు పరిగెడితే ధర్మయ్య దొరికిపోవచ్చు. అంచేత ప్రహరీ గోడవైపు అందర్నీ తప్పుదారి తొక్కించేడు.

నే: అంతా బాగానే వుందికాని... ధర్మయ్య తన నేరాన్ని ఒప్పుకోకపోతే, ఈ కేసు నిరూపించడానికి నిదర్శనాలున్నాయా?

మ: ఈతలుపు కొట్టేవాడు 101 అయివుండాలి...ఓ...యిదుగో.... ఏమాయ్... కాయా పండా?

101: పండేనండి. ఇదిగో చాకో పంచా. మీరుచెప్పినట్టే మనకి మూడోమైలులో ఎదురయిన పంటకాలవ దగ్గరంతా నేనూ ఇద్దరు దారేపోయేవాళ్ళూ వెతికేం. ఆదగ్గరలోనే పొదల్లో ఈరక్తం మరకలున్న గుడ్డలు దొరికేయండి.

మ: మరి సినిమాహాల్లో కనుక్కున్నావా?

101: ఒకటి కాదు... రెండు అవుట్ పాస్‌లు పోయాయిటండి. "బావా మరొక్క సందేహం..." అన్నాను 101 బయట కెళ్ళిపోయేక.

మ: సింగారికి సీతన్నకి వున్న సంబంధం శేషయ్యకెలా తెలుసునూ అంటావు, అవునా? ఆప్రశ్నే నన్నూ చాలా తికమక పెట్టింది. దానికి ఒకటే అవకాశం వుంది. పక్కింటివాళ్ళద్వారా తెలిసివుండాలి. అనుకున్నట్టుగానే చలమయ్యభార్యతో శేషయ్యకి బంధుత్వంవుందని తెలిసింది. నేను చలమయ్యభార్య దగ్గరకెళ్లి దబాయించేటప్పటికి తనే శేషయ్యతో చెప్పేనని ఆయిల్లాలు ఒప్పుకుంది."

"ఇంతకీ నువ్వు రాస్తున్న పుస్తకం ఎప్పటికి పూర్తవుతుందీ...అం......304... చూడు ఈ యిరవైరూపాయిలూ నీదగ్గరుంచుకుని, మాబావకి ఎనిమిది నాకొకటి మొత్తం తొమ్మిది టిక్కట్లు 'చరణదాసి' మొదటాటకి రిజర్వు చెయ్యించు. మిగిలిన డబ్బు దగ్గిరుంచుకుని ఈ కేసుమీద వచ్చిన మీ ఆరుగురు కానిస్టేబుల్సూ రాత్రి రెండో ఆటకి కొట్టెయ్యండి," అన్నాను ధీమాగా జేబులోంచి డబ్బు తీసి అందిస్తూ. 

# శ్రీమతికి చీర కొనాలి

## "జగన్నాథ్"

"ఏమండోయ్, ఎలాగూ వెళ్తున్నారు. నా జాకెట్లన్నీ చినిగిపోతున్నవి... నాకు మంచి జాకెట్టు గుడ్డలు తీసుకురండి... అందులో కొంచెము నాజూకైనవే తెండి— మరచిపోరుగదూ..."

"అలాగే చూసుకుందాంలే నాకు తీరుబడివుంటే. నే వెళ్ళేది ఉద్యోగప్రయత్నము కోసం. ఎవరిని ఎప్పుడు కలవాలో, ఎలా కలవాలో నేనే నిర్ణయించుకొని, వాళ్ళ సమయానికి నే కనిపెట్టుకొని కూర్చుండాలాయె. అటువంటప్పుడు తీరికెలా దొరుకుతుందో నీవే చెప్పు. తీరిక దొరికితే తప్పకుండా కొని తెస్తా".

"అదేమిటండోయ్, ఉపోద్ఘాతమంతా తేను అన్న ధోరణిలో నడిపించి, చివరకు తీరికమీద భారముపెట్టి, తప్పకుండా తెస్తానంటున్నారు... ఇంతకీ ఆ పట్టణము పోతే మీకు నామీద ధ్యాసేవుండదుగా... ఇంతకూ మీకు చెప్పడము నాదే పొరపాటు. ఆ మాత్రానికి గూడా మా పుట్టింటివాళ్ళే నడగడమా అని మీతో అన్నానుకొని, లేకపోతే యీ సంగతి మీతో కదపక పోదును గదా... పోనీ మీకు తేవడానికి ఇష్టంలేకపోతే, తేనక్కరలేదులే."

"అదేమిటి అనూ! తీరికచేసుకొని తప్పకుండా తెస్తాను," అని చెప్పిన మాటలు, స్నేహితులతో బాతాఖానీ కొడుతూ, అయ్యరు హోటల్లో కాఫీ తాగుతున్న నాకు, హఠాత్తుగా జ్ఞాపకము వచ్చినవి. కొనడానికిదే సమయమని, మనస్సులో నిర్ణయించుకొని స్నేహితులను వదిలించుకొని బజారులో పడ్డాను... "జాకెట్లేమిటి......టూసిల్లీ... మంచి చీరకొని తీసుకువెళ్తే ఎంతైనాసంతోషిస్తుంది... చూశావా నీవు నన్ను అనవసరంగా అన్నావుకొని, నాకెప్పుడూ జ్ఞాపకముంటావుసుమా అని ఋజువు చేసినట్లవుతుంది... ఇంతకూ జాకెట్లు లేవన్నదిగా, చీర తీసుకువెళ్తే ఎలా... ఎందుకులే వన్నదిలే... అదంతా ఒక ఫోర్సు... లేకుంటేనేగాని కొననని... అంతేగా..." కాబట్టి చీర తీసుకువెళ్ళడమే మంచిదనుకొని నడిరోడ్డుపై నడుస్తూ ప్రక్కకు చూసేసరికి వల్లటి బోర్డుమీద తెల్లటి అక్షరాలు కనబడ్డాయి. "ఖటావ్ వాయిల్సు, జార్జెట్టు, బెంగుళూరు సిల్కు... వగైరా చీరలు... సరసమైన ధరలు" అని. అరెరే యీ వేళే అంగుకున్నవంటున్నాడు. సరిక్రొత్త రకాలై వుండవచ్చును. అలా అయితే చాలా నాజూగ్గా వుంటాయని అనుకుంటూ మీదకి చూసేసరికి "సిల్కు ఎంపోరియమ్" అని ఆషాపు నిసలుపేరు తెలియవచ్చింది... "అరరే... యీ షాపువాళ్ళేగదూ పెద్ద మడత గాళ్ళని మా స్నేహితులు మొన్న మాటల ధోరణిలో చెప్పింది... మా స్నేహితుడు రమణరావు వాళ్ళచెల్లికి చీర కొన్నప్పుడు, యీ షాపులో నేగదూ బోల్తాపడింది... అదనంగా, 5 రూపాయిలు అంటకట్టింది యీ షాపేకదూ... అంతేలే... మోసం.... పచ్చి మోసం... యింత లేసి పెద్ద అద్దం బీరువాలు పెట్టుకొని, వెళ్ళినవెంటనే, అతి మర్యాద చూపే యీ షాపువాళ్ళు మోసంచేయకేమిచేస్తారులే... ఎవరికి చేస్తారు... రమణరావులాంటి వాళ్ళకు చేస్తారు. ఆ షాపువాడి మాటలకు అయిసైపోయి ప్రక్కషాపులలో వాకబు చేయకుండా కొనేవాడికి చేస్తారు... అంతేగాని నన్నెలా బోల్తాకొట్టించగలరు...... పోనీలే ఎందుకైనా మంచిది. వెళ్ళక వెళ్ళక యీ కొట్టులోనికా వెళ్ళడము... యింకొక కొట్టుకుపోతే ఎందుకైనా మంచిది." అని ఆలోచిస్తూ నడుస్తుండగా ప్రక్క కొట్టు షోరూములలోనున్న బొమ్మలు నన్ను వెక్కిరిస్తున్నట్లు చూస్తున్నవి..." ఆహా! ఏమి బట్టలు... ఏమి చీరలు......బయటే యింత అట్టహాసంగావుందిగదా యింక లోపల యింకెంత మంచిరకాలున్నాయో...... వుంటాయి. వుంటాయి. ఎంతైనా మంచి రకాలూ వుంటాయి. మంచిబోల్తాకూడా వుంటుంది. ఎంత అట్టహాసమువుంటే, అంత మోసమని ఎవరో పెద్దలుచెప్పినట్లు చిన్న జ్ఞాపకం... పెద్దలేంటి...... వేమనగారే చెప్పారు...... మేడిపండు చూడమేలిమై యుండును, పొట్టవిప్పి చూడ, పురుగులుండు" నని. అంతేలే. అదంతా నిజం. ఇంత పెద్ద కొట్టులో ఎంతైనా మోసముంటుంది... లేకపోతే ఎందుకింత అట్టహాసం యీ షోరూములకింత తగలెట్టాలా..." అని ఆలోచించుకుంటూ ఫర్లాంగుదూరం వచ్చేసరికి మెర్క్యురీలైట్లలో మెరిసిపోతున్న "బూల్ చంద్ హీరాచంద్" షాపుదగ్గర కొచ్చాను. అప్పుడే కార్ల మీద ఎవరో వచ్చి లోనికి దర్జాగా పోతున్నారు... "ధనవంతులు కాబట్టి దర్జాగా పోతున్నారు... నాలాంటి సామాన్యులు లోనికి వెళ్ళగలరా. ఇంత హుందాతనంగా, యింత నగిషీగా యీ షాపుందిగదా, ఎవరు వెళ్తారని యీ అట్టహాసమంతా... సామాన్యుడెవ్వడూ సాహసించలేడుగా... ఐతే ఖరీదైన మను

(34-వ పేజీ చూడండి)

ప్రాచీనగాథాలహరి

# పరమ శివార్చన

౧

కౌశ్మరామాత్యుడు కూరమంత్రి భవంతి ప్రాంగణంలో వందిమాగధుల కైవారాలు ప్రభాత మంగళతూర్యాల తీరులలో హోరుమని మారుమోగాయి.

కూరమంత్రి వందిమాగధులలో ప్రధాన వంది కృతమందారుడు. మంత్రి ప్రాతఃకాల వేళ తన పరమశివార్చన యావత్తు యథావిధిగా ముగించుకొని కొలువు కూటానికి బయలుదేరి వెళ్ళే వేళలో అనుదినము కృతమందారుడొక హెచ్చరిక చేస్తూ ఉంటాడు. ఈనాడుకూడా అతడలాగే ఆ హెచ్చరిక చేశాడు. అది శ్లోక రూపంలో ప్రతిధ్వనించే హెచ్చరిక :

"అయ మవసర ఉపకర్తుం
ప్రకృతి చపలా యావదస్తి సంపదియమ్
విపది సదాభ్యుదయిన్యాం
పున రుపకర్తుం కుతో వసరః"

"ఈ ఐశ్వర్యం స్వభావతః చంచలమైనది. ఇది చేతనున్నప్పుడే ఇంకొకరికి ఉపకారం చెయ్యాలి. ఆపత్తులెల్ల వేళలా మీదిమీదికి విరుచుకుపడుతూనే ఉంటాయి! కనక ఈ క్షణంలోనే ఇంకొకరికి ఉపకారం చెయ్యాలి! దానికిదే తగినక్షణం!"

అదీ ఆ శ్లోక తాత్పర్యం!

ఆ హెచ్చరిక వినగానే, కూరమంత్రి హృదయం ఆనందంతో పరవళ్లు తొక్కి పులకరించింది. ప్రధానవంది కృతమందారుని వైపు పాకమారుచూచి చిరునవ్వు నవ్వి కూరమంత్రి వెంటనే తన కొలువు కూటానికి వెళ్లిపోయాడు.

ధర్మాసనంమీద కూర్చున్న తరవాత కొంత సేపటివరకు కూరమంత్రి హృదయంలో ఆ శ్లోకార్థమే ప్రతిధ్వనించింది.





అది ఆత్మదఘ్నంగా ఆకళించుకొన్న మంత్రికి తన ధర్మనిర్వహణలోను, కులదైవతమైన పరమశివుని పాదపద్మార్చనలోను కొంతవరకు సంతృప్తి కలిగింది.

మంత్రి ఆక్షణంలో తాను చాలావరకు ధన్యజీవినే అని అనుకొన్నాడు. అది యథార్థమే.

కాశ్మీరాధీశ్వరుడు అవంతివర్మ రాజ్యానికి వచ్చినప్పటినించీ కాశ్మీర ప్రజ అతని ధర్మతత్పరతకెంతో ఆనందించారు.

అవంతివర్మ ఎంతో ప్రయత్నంచేసి ఏరికోరి శూరమంత్రికి ప్రధానామాత్యాధికారం అప్పగించాడు. ఆ క్షణంనించీ మంత్రి తన సేవాతత్పరతతో అవంతివర్మ హృదయం చూరగొన్నాడు. కాశ్మీరదేశంలో అంతటి అన్యోన్యతకలిగిన రాజమంత్రుల నింతవరకెన్నడు కని విని ఎరగమని ఆ దేశ ప్రజ వారి పరస్పర సౌహార్దం అనేకవిధాల ప్రస్తుతించారు.

రాజమంత్రులిద్దరు ఒకరొకరిని బావమరదుల వరసలో పలకరించుకొనేవారు. ఒకరిమాట ఇంకొకరెన్నడు జవదాటలేదు. కొంతకాలానికి వారిద్దరిలోను రాజ మంత్రులెవరో నిర్ణయించడమే కష్టమై పోయింది! వారి అన్యోన్యతావధి అంతవరకు వెళ్ళిపోయింది!

అవంతివర్మ రాజ్యానికి వచ్చేసరికి కాశ్మీర దేశంలో షట్శాస్త్రాల పఠన పాఠాలు బాగా సన్నగిల్లిపోయాయి. రాజమంత్రులిద్దరు కలిసి వారాణసి, ఉజ్జయిని మొదలైన నగరాలనుండి ఆయా శాస్త్ర విద్వాంసులెందరెందరినో శ్రీనగరానికి పిలిపించి తమ దేశంలో తిరిగీ ఆయా శాస్త్ర సంప్రదాయా లనూచానంగా వెలయింపచేశారు.

ముక్తాకణకవి, శివస్వామి, రత్నాకరుడు, అలంకారశాస్త్ర ప్రవర్తకుడు, ఆనందవర్ధనుడు ఆ కాలంలో కాశ్మీరంలో మీను మిగిలిన విద్వత్కవులు. వారందరిని ఆ రాజమంత్రులిద్దరు తమ ఆస్థాన విద్వత్కవులుగా నియమించి వేవిధాల గౌరవించారు.

అవంతివర్మ ఆస్థాన విద్వాంసులందరు మహా రాజోచిత మర్యాదలతో గజాశ్వాందోళికాదివాహనాలలో రాజాస్థానానికి విచ్చేసేవారు! అపూర్వమైన అవంతివర్మ విద్వద్గౌరవం కళ్ళారాచూచిన కాశ్మీర ప్రజ పూర్వం మేఘవాహననృపతి ధర్మపరిపాలనలో ఇలాంటి విద్వద్గౌరవమే జరిగేదని అత్యాశ్చర్యంగా చెప్పుకునేవారు!

శూరమంత్రి ప్రత్యేకంగా తన పేరట కాశ్మీరంలో శూరాగ్రహారం నిర్మింపజేసి అక్కడ శూరేశ్వర శివాలయప్రతిష్ఠ చేశాడు.

కాశ్మీరాధిపతి అవంతివర్మ అంతకన్నా మహా వితరణశాలి అనీ పరమశివార్చనాపరుడనీ ప్రఖ్యాతి సంపాదించాడు.



# పరమ శివార్చన



"లక్ష్మీదేవి దేవవేశ్యలయిన అప్సరసల సరసనే జన్మించింది. కనకనే ఆ దేవత కంతటి చాంచల్యం సంక్రమించింది. ఉత్తర క్షణంలో ఈ ఐశ్వర్యాన్ని కేమిరానున్నదో ఎవరు చెప్పగలరు?"

అని అవంతివర్మ తన అపార సంపదైశ్వర్యాలన్నీ దానధర్మాల కిందే వ్యయం చేసేవాడు. అవంతివర్మ వంశీయులయిన కాశ్మీర రాజన్యులందరు నిత్య శివార్చనా నిరతులు. అయితే అవంతివర్మకు చిన్ననాట కొంచెం విష్ణుభక్తి కుదిరింది. కాని శూరమంత్రితో సౌహార్దభాగ్యం లభించినప్పటి నించీ అతడు త్రికరణశుద్ధిగా పరమ మాహేశ్వరుడైనాడు.

శూరమంత్రి సౌహార్దమే దానికి కారణమనీ ఆ మంత్రియెడల ఆయనకు కలిగిన ఆదరాభిమానా లటువంటివనీ రాజబంధువులు కొందరు తమలో తాము గుసగుసలాడుకోక పోలేదు. ఏది ఏమైనా ఆ రోజుల్లో కాశ్మీరంలో శైవ దేవాలయ ప్రతిష్ఠ లసంఖ్యాకంగా పెరిగిపోయాయి. అనేక జీర్ణ శైవ దేవాలయాల పునరుద్ధరణం జరిగింది. అటువంటి ధర్మమూర్తి అవంతివర్మ దగ్గర తన కమాత్యాధికారం లభించడం కేవలం తన పూర్వజన్మ పుణ్యవిశేషంవల్లనే జరిగిందని శూరమంత్రి అనుక్షణము ఉబ్బితబ్బిబ్బై పోయేవాడు.

అయితే శూరమంత్రి జీవితాని కంతటికీ ఒకేఒక మనోవ్యాధి పట్టుకుని పీడించింది. అతనికి ప్రథమ కళత్రంవల్ల కలిగిన కుమారుడిప్పటికి బాగా చేతి కందివచ్చాడు.

అతనిపేరు రత్నవర్ధనుడు. తండ్రి కన్ని విధాలా అనువర్తనగానే నడుచుకుంటున్నాడు.

ప్రథమ కళత్రం పోయే సరికింకా అతను నడివయస్సులోనే ఉన్నాడు. ఆపైన బంధువులంతా నిర్బంధించడంవల్ల అతనికిక తిరిగీ వివాహం చేసుకోక తప్పలేదు. ద్వితీయ కళత్రాని కెంతకాలానికీ సంతతి కలగలేదు. మరికొంతకాలాని కామె ఆ ఆశ నిరాశ చేసుకొని ఒక పసివాణ్ణి దగ్గరికి తీసుకుంది. వాడికెంతో ముద్దుగా పినాకధన్వా అని పేరు పెట్టుకుంది. ఆమె శివభక్తిలో భర్తకన్న మిన్న అని పేరుకెక్కింది. కనకనే తన దత్తపుత్రుని కాపరమేశ్వరుని పేరే పెట్టుకుంది. కాని ముద్దుగా ఆ పసివాణ్ణి 'ధన్వా' అని పిలిచేది.

క్రమంగా వాడు పెరిగి పెద్దవాడైనాడు. మహాభక్తులకు, పరమనాస్తికులు, అపార వితరణమూర్తులకు పరమలోభులు, దిగ్దంతుల వంటి విద్వాంసులకు పరమమూర్ఖులు కుమారులుగా ఉదయించడం ఈసృష్టి అత్యద్భుతాలలో ఒక పరమాద్భుతం! దానికి వ్యాస మహర్షి శాపంకూడా కొంచెం తోడుపడిందేమో!

ఏదిఏమైనా పినాకధన్వ పెరిగి పెద్దవాడై తండ్రి శూరమంత్రి కొక దారుణ హృదయశూలంగా పరిణమించాడు. అతగాడి కెంత చదివించినా ఒక్క అక్షరం ముక్కకూడా అంటలేదు! తల్లిదండ్రులు లేది చెప్పినా ఆక్షణంలో తలఊపి ఉత్తర క్షణంలో అది అతిక్రమించడమే అతనికొక పరిపాటి!

కాని తల్లిదండ్రుల కిష్టంలేని సాము గరిడీలలోను, మల్లవిద్యలలోను, దుస్సాహసాలలోను అతనికి బాగా ఆస్థ కలిగింది. కఠినంగా శిక్షిస్తే మరింత రెచ్చిపోతాడేమోననే భయంకొద్దీ తల్లిదండ్రులిద్దరు కొంతకాలంవరకు అతని ధోరణి చూసీ చూడనట్టు మాట్టాడ కూరుకున్నారు. కాని క్రమక్రమంగా అతని అవినయధోరణి బాగా రెచ్చిపోయింది. అంతేగాని అదిఏమాత్రము తగ్గలేదు. అయినా పరమేశ్వర కృపవల్ల అతడెప్పటికైనా దారిని పడకపోతాడా అని వారిద్దరు అలాగే దేవతలకు మొక్కులు మొక్కుకుంటూ కొంతకాలంపాటూరుకున్నారు.

శూరమంత్రికి ధర్మాసనంమీద సుఖంగా కూర్చున్న క్షణంలో అదంతా ఒక మెరుపులా స్ఫురణకు వచ్చింది. అతడొక నిట్టూర్పువిడిచి తిరిగి తన దైనందిన రాజకార్య పర్యవేక్షణలో పడ్డాడు.

## ౨

అప్పటికి హేమంత ప్రాతఃకాల సూర్యకిరణాలతని సువర్ణ ధర్మసింహాసనంపై ప్రసరించి బంగారు హారతులెత్తాయి. అంతవరకు శూరమంత్రిఏ వేవో రాజ్యవ్యవహారాలు పరిశీలిస్తూ తలవంచుకుని కూర్చున్నాడు. అందుచేత ధర్మనిర్ణేతలైన ప్రాడ్వివాకు లెవరు అతని సన్నిధికి రావడానికి సాహసించలేదు. మంత్రి కిరువైపులా ఇద్దరు పరిచారకులనుక్షణము మంత్రి ఆజ్ఞకోసం ఎంతో ఆత్రంగా నిరీక్షిస్తూ నిలుచున్నారు.

శూరమంత్రి తన రాజకార్య పర్యవేక్షణము గించాడు. అతనికెదురుగా అనతిదూరంలో కాశ్మీరంలో సుప్రసిద్ధమైన విజయేశ్వర, త్రిపురేశ్వర, భూతేశ్వర శైవదేవాలయాల సువర్ణకలశాలు, అప్పుడే వికసించిన బంగారు తామర పూవుల్లా తళతళా మెరుస్తూ ప్రత్యక్షమైనాయి. శూరమంత్రి ఆ ముగ్గురు దేవతలను మనసారా సంస్మరించుకొని వారికి మనస్సులోనే సవినయంగా నమస్కారం చేశాడు.

అంతలో ఒక ప్రాడ్వివాకుడు సవినయంగా లేచినిలబడి శివద్రవ్యం అపహరించిన ఇద్దరు అపరాధుల ఘోరాపరాధాలు పరిశీలించి వారికి సముచితమైన రాజదండనం విధించవలిసిందని విజ్ఞప్తిచేశాడు.

ఆనాడు కాశ్మీర రాజ్యంలో సామాన్యాపరాధుల అపరాధాలన్నీ ధర్మాధికారులైన ప్రాడ్వివాకులే పరిశీలించి తగిన దండనలు విధించేవారు. కాశ్మీరదేశంలో దేవాలయాల ద్రవ్యం అపహరించినవారిని నిర్దాక్షిణ్యంగా శిక్షిస్తారు. అందులోను శివద్రవ్యం అపహరించినవారికి కేవలం దారుణ మరణదండనం తప్ప మరి వేరే దండనమేమీ లేదు. అందుచేత ప్రాడ్వివాకు లా వ్యవహారాలు మహామాత్యునికే విన్నవిస్తారు. ఆపైన మహామాత్యుడే వారికి తగిన శిక్షలు విధిస్తాడు.

ఆ ప్రాడ్వివాకుడా ఇద్దరు అపరాధుల ఘోరాపరాధాలు సాక్ష్య పరిశీలనద్వారా నిస్సందేహంగా ఋజువైనాయని విన్నవించి ఆ వ్యవహారానికి సంబంధించిన కవిలెకట్టలు, భూర్జపత్రాలు అన్నీ శూరమంత్రి ముందుంచాడు.

శూరమంత్రి ఆపత్రాలన్నీ పరిశీలించాడు. తిరిగీ దూరదూరంగా నిలుచున్న ఆ అపరాధుల నిద్దరినీ బాగా నిశితంగా పరిశీలించాడు. వారిద్దరి ముఖాలు అప్పుడే భయంకర మృత్యుభీతితో బాగా వెలవెలబోయాయి. వారి కనతిదూరంలో నిలబడిన ఆ అభాగ్యుల బంధుమిత్రులు వారి ప్రాణాలమీద నిరాశ చేసుకుని నిశ్శబ్దంగా కుమిలికుమిలి దుఃఖిస్తున్నారు.

వారిలో మొదటి అపరాధి బందిపోటు దొంగతనాలలో బాగా అందెవేసిన చెయ్యి. అతడింతకుపూర్వం అలాంటి అపరాధాలెన్నెన్నో చేసి కఠిన కారాగారవాసమే నిజనివాసం చేసుకొన్నాడు. ఆ దొంగల నాయకుడు విజయేశ్వరస్వామి మడిమాన్యాలలో పడి యథేచ్ఛగా బందిపోటు దొంగతనం సాగించాడు. ఆ అభాగ్యుణ్ణి మదించిన ఏనుగు కాలికింద మట్టించి చంపివెయ్యవలసిందని మంత్రి కఠినంగా ఆజ్ఞాపించాడు.

ఇక రెండవ అపరాధిమాట. అతగాడింకా దొంగతనాలలో బాగా ఆరితేరలేదు. కాని అతగాడి ధోరణి చూస్తేనే గర్భదరిద్రుడుల్లా కనిపిస్తున్నాడు. అతడు శూరమంత్రి వంశీయుల ఇష్టదైవతమైన భూతేశ్వరస్వామి ఆలయంలో జొరబడి అమ్మవారి ముక్కెర కాజేశాడు. రాజాధికారులా ముక్కెర అతని పూరిగుడిసెలో వెదికి పట్టుకున్నారు.

ఆ అపరాధిని చూడగానే మంత్రి

హృదయంలో కొంచెం ఆర్ద్రత పొడచూపక పోలేదు. కాని ఆదొంగ చేసిన అపరాధం అక్షంతవ్యం! మంత్రి మాత్ర మేమి చెయ్యగలడు! మెడకొక బండరాయి కట్టి వెంటనే వితస్తానదిలో పడవేయవలసిందని కఠినంగా శిక్ష విధించాడు. వెంటనే తన ధర్మాసనం విడిచి కిందికి దిగివచ్చాడు.

ఆసమయంలో ఆ అభాగ్యుని వృద్ధమాత చుట్టూనిలిచిన రాజాధికారి శ్రేణి ఛేదించుకొని వచ్చి మంత్రి పాదాలమీద పడి వలవలా వాపోయింది! ఆ దొంగ ఆమె కొక్కొక పుత్రుడు! తన కుమారు డదివర కెన్నడు అటువంటి దారుణాపరాధం చెయ్యలేదనీ ప్రథమ తప్పిదం మన్నించవలసినదనీ ఆవృద్ధమాత దీనాతి దీనంగా ఆక్రోశించింది. ఆనాటి కాశ్మీరరాజ్యంలో ఎవరినైనా క్షమించి విడిచిపెట్టవచ్చును గాని దైవద్రవ్యం అపహరించినవారిని క్షమించి విడిచిపెట్టడానికి వీలులేదు! అందులోను ఆ అభాగ్యు డపహరించినది శివద్రవ్యం! తత్రాపి అది అమ్మవారి ముక్కెర. అది అవంతివర్మ మహారాజు ప్రత్యేకంగా సభక్తికంగా అమ్మవారికి సమర్పించుకొన్న ముక్కెర! ఆ పరిస్థితులలో శూరమంత్రి మాత్ర మేమిచెయ్యగలడు! ఆ వృద్ధురాలి దీన రోదనధ్వని వినలేక తటాలున ముఖం మరొక పక్కకు తిప్పివేసుకొన్నాడు! అది గ్రహించిన రాజసేవకులు వెంటనే ఆ వృద్ధురాలిని బలవంతంగా అక్కడనుంచి తొలిగించి వేశారు!

అయినా ఆ వృద్ధురా లలాగ గోలుగోలున విలపిస్తూనే ఉంది. ఆమె దారుణాక్రంద ధ్వని ఆ పరిసరంలో అంతటా ఒక వన్య పశువు ఆక్రోశధ్వనిలా జాలిగా సన్నసన్నగా ప్రతిధ్వనించింది.

శూరమంత్రి వెంటనే తన భవంతికి వెళ్లిపోయి ఏకాంతంగా ఒకచోట జేరి రెండు చేతులతోను తల గట్టిగా పట్టుకొని కూర్చున్నాడు. రెండు చెవులు బొటనవ్రేళ్లతో గట్టిగా మూసుకొన్నాడు. అయినా ఆ అభాగ్యురాలి ఆక్రందన ధ్వని అతని ప్రతినాడీస్పందనంలోను కరుణాతికరుణంగా, దీనాతి దీనంగా ప్రతిధ్వనించింది!

మంత్రి శిరస్సు దారుణశిరో వేదనతో శతధా వ్రయ్యలై పోయింది. తీవ్ర శిరో వేదనతో బాధపడుతున్నానని చెప్పి అతడా నాటికిక అన్నపానాలే ముట్టలేదు. ఇక ఆ రాత్రి రాత్రిఅంతా అతని కొక్క కునుకైనా పట్టలేదు.

ఆ రాత్రి తెల్లవార్లు అతనికిక ఆ వృద్ధమాత దీనాక్రోశమే వినిపించింది. ఆ క్షణంలో అతనికా రెండవ అపరాధిని క్షమించి విడిచిపెట్టివెయ్యవలెనని అనిపించింది. ఆ మరునాడుదయమే లేచి ఆ అపరాధుల సంగతి ఏమయినదని దౌవారికులను ప్రశ్నించాడు. వారిద్దరికీ మంత్రి ఆజ్ఞప్రకారం అంతకు పూర్వమే శిక్షలు విధించడం జరిగిపోయిందని వారు సమాధానం చెప్పారు!

మంత్రి అంతకుపూర్వం ఎందరెందరో శివద్రోహులకు శిక్షలు విధించాడు. కాని అంతటి దారుణ శిక్షలు విధించవలసినంత అవసరం అంతకుపూర్వం ఎన్నడు కలగలేదు. అయితే ఆ అపరాధులు చేసిన ఘోరాపరాధాల దృష్ట్యా మంత్రి కిక మరి గత్యంతరమే కనిపించలేదు! ఎంతటి దయార్ద్ర హృదయుడైతే మాత్రం! అతడేమి చెయ్యగలడు? ఆ నాటి కాశ్మీర శిక్షాస్మృతి సంప్రదాయం తీరే అంతటిది!

దౌవారికులు చెప్పిన సమాధానం విని మంత్రి అలాగే నిర్ఘాంతపోయాడు. ఆ తరవాత గతించినదానిని గురించి మథనపడడంవల్ల ప్రయోజన మేమిలేదని కొంచెం సమాధానపడ్డాడు.

కాని అప్పటినించీ శూరమంత్రి హృదయంలో కి కాశ్మీర మహామాత్య పదవి విసర్జించి వెంటనే వారణాసికి వెళ్ళిపోవాలనే సంకల్పం బయలుదేరి బాగా బలపడింది. ఆసంకల్పం అతని హృదయంలో అంతకుపూర్వమే అంకురించింది గాని ఆ నాటితో అది బాగా వేరుదన్నింది.

శూరమంత్రి కప్పటికి యాభైయో పడి దాటి అరవయ్యోపడి బాగా పైబడింది. అతని జ్యేష్ఠకుమారుడప్పటికి బాగా ప్రాజ్ఞుడైనాడు. రెండవ కుమారునికి బాగా ప్రాజ్ఞత వచ్చే వయస్సేమో వచ్చిందిగాని ఆకతాయితనం మాత్రం నానాటికీ పెచ్చుపెరిగిపోయింది. అతన్ని ఒక ఇంటివాణ్ణి చేసి కొంచెం మంచిదారిని పెట్టిన తరవాత సకళత్రంగా వారణాసికి వెళ్ళిపోయి శ్రీ విశ్వేశ్వరదేవ శ్రీ పాదసన్నిధిని తన జీవిత శేషం యావత్తు గడిపివెయ్యాలని అతడంతకు పూర్వమే సంకల్పించుకొన్నాడు. కాని రెండవ కుమారుడు పినాకధన్వమీది మమకారము, నానాటికీ పెచ్చుపెరిగిపోతున్న అతని ఆకతాయి తనము ఒకదానికొకటి తోడై అతని సంకల్పసిద్ధికొక గొప్ప అంతరాయం కలిగించాయి.

అతడలాగే రెండు చేతులతోను తల గట్టిగా అదిమి పట్టుకొన్నాడు. త్రికరణశుద్ధిగా భూతేశ్వరస్వామి నొక్కమారు ధ్యానించుకొన్నాడు:

"స్వామీ! ఇంకా ఎంతకాలం నాకీ భవబంధనం కల్పించదలిచావు తండ్రీ! నేను నీ యెడల చేసిన అపరాధమేమి? నామీద నీకెందు కింతగా దయతప్పింది. నీ పాద సన్నిధికి చేరుకునే అదృష్ట మిక నాకెన్నటికీ లభ్యం కాదా!"

ఆ ధ్యానతత్పరతలో అతనిహృదయంలో హఠాత్తుగా మెరుపులా ఒక అభిప్రాయం స్ఫురించింది.

"ఆ అపరాధులు తాముచేసిన ఘోర పాపాలకు తగిన ప్రతిఫలం అనుభవించారు. దీనికి నేనెందుకు విచారించాలి! నాధర్మమేదో నేను దైవముఖం చూచి సరిగా తూచినట్టుగా నిర్వర్తించాను! ఇంతకీ ఎవరి కర్మ ఫలితాని కెవరు కర్తలు?"

అని అంతలోనే ధైర్యం తెచ్చుకొని గుండె రాయిచేసుకొన్నాడు. కర్తవ్య నిర్వహణలో అతనిహృదయం ఒకొక్కప్పుడు మృదులాతిమృదులమైన కరుణాప్రవాహమై వెల్లివిరిసిపోతుంది. ఒకొక్కప్పుడది వజ్రంకన్నా కఠినమై నిష్ఠుర రూపం ధరిస్తుంది. ఆ క్షణంలో అతని హృదయంలో సరిగా అటువంటి పరిణామమే జరిగింది.

## 3

అటుపిమ్మట శూరమంత్రి కాశ్మీరంలో దేవమాన్యాలుగాని దైవద్రవ్యంగాని అపహరించిన వారి నందరినీ నిర్దాక్షిణ్యంగా హతమార్చి వేశాడు. దానితో క్రమక్రమంగా అతని హృదయానికి కొంచెం సంతృప్తి కలిగింది. ఆపైన అతని కుమారుడు పినాకధన్వకూడా క్రమక్రమంగా దారికి వస్తున్నట్టే కనిపించాడు. ఎప్పుడులేని దతడొకనాడు భూతేశ్వరస్వామి ఆలయానికివెళ్ళి స్వయంగా స్వామికి సువర్ణ బిల్వదళాలతో సహస్రనామార్చనాదులు జరిపించివచ్చాడు. ఆదివిన్న మంత్రి అతన్ని చూడగానే గాఢంగా కౌగలించుకొన్నాడు. క్రమశః భూతేశ్వరస్వామి కటాక్షలేశం తనపై ప్రసరించినదని పరమానంద భరితుడైనాడు.

అలాగ ఒకపక్షంరోజులు గడిచిపోయాయి. ఒకనాడు శూరమంత్రితన కొలువుకూటంలో రాజకార్యాలన్నీ శీఘ్రంగా ముగించుకుని తొందరతొందరగా భవంతికి వచ్చివేశాడు.

(55-వ పేజీ చూడండి)

# గజ్జెల దయ్యం

శ్రీమతి కాపురానికి వస్తూనే మలయమారుతాన్ని, మన్మథాస్త్రాల్ని, ఆనందదాయక జీవితానుభవంకోసం, వెంటపెట్టుకొచ్చింది. అందుకేకాబోలు చాల రోజులవరకు ఆ మలయమారుత పరిమళ ఘుమఘుమలు బాధిస్తుండేవి నన్ను.

"భార్య వచ్చినతర్వాత నీవు పూర్తిగ మారిపోయావురా. కనీసం ఒక్క గంటైనా యిప్పుడు మాతో హుషారుగా గడపవు" అని మా ఫ్రెండ్సు రిమార్కులు చేసినా ఆఫీసునుంచి నేరుగా - వీలుగావుంటే పని కూడా ఎగకొట్టి - యింటికి చేరేవాడిని. కాని స్వయంగా మా శ్రీమతి ఆ రోజు "కొంచెం త్వరగారండి" అనేసరికి ఆఫీసుకు కాజువల్ లీవ్ పెడదామనిపించిందికాని ప్రొప్రయిటరుకూడా లేకపోవడంతో గుమాస్తాలిక పని చేయరని తప్పక వెళ్ళవలసివచ్చింది.

ఆఫీసుబయట మా ఫ్రెండ్సు తీవ్రంగా విమర్శలు చేస్తుంటే నేనూ వేలుపెడదామని వెళ్ళాను. వారి చర్చ ముఖ్యాంశము దయ్యాలున్నాయా లేవా అని. అందులో యిరుపక్షాల బలం సమానంగా వుంది. నేను యేపక్షమో వెంటనే డిసైడ్ చేయమన్నారు. M. sc డిగ్రీ పుచ్చుకున్న నేను విజ్ఞాన శాస్త్రరీత్యా దయ్యాలులేవని చెప్పడమే సబబని తోచింది ... గడియారం 11 గం|| లు కొట్టడంతో అందరం ఆఫీసులోకి పోయాము.

లంచ్ కాగానే, నావర్కు అసిస్టెంటు మానేజరుకు పురమాయించి యింటిముఖం పట్టాను. అంత త్వరగా వచ్చినందుకు శ్రీమతి చాలా సంతోషిస్తుందని అనుకుంటూ కాంపౌండులో ప్రవేశించాను.

శ్రీమతి చిరునవ్వుతో ఆహ్వానిస్తూ ఎదురువచ్చి చేతిలోవున్న కోటును తీసుకుని "ఏమండీ చాల పెందలాడే వచ్చారే, ఈ కాఫీ తీసుకోండి, ముందు" అంటూ ఫ్లాస్కులోవున్న కాఫీని కప్పులోపోసి యిచ్చింది. తీరికగా కుర్చీలో కూర్చుని కమ్మని కాఫీ ఐపోతుందేమో నన్నట్లు చప్పరిస్తూ, ప్రశ్నార్థకంగా శ్రీమతివైపు చూచాను.

"మావూరిలో రామారావుగారున్నారు చూడండి, ఆయనకూతురు శాంత యీవూరొచ్చిందట. అడ్రస్ వుంది. వెళ్ళి చూసొద్దామంటారా?" అని ప్రారంభించింది శ్రీమతి.

"నీ స్నేహితురాల్ని చూడడానికి నేను తోడురావడం దేనికో?" సమాధానంకోసం ఆసక్తిగ ముందుకు జరిగాను.

"ఏమీలేదు. నేనొక్కతెనే వెళ్ళడం దేనికని. అదికాక పాపం ఆమెకు యీమధ్య యేదో గాలిసోకిందట చికిత్సకోసం యిక్కడకు వచ్చారుకాబోలు."

"ఏమిటి దయ్యంపట్టిందా! ఏదో మెంటల్ షాక్, దయ్యం పట్టలేదు

"అనూరాధ"

భూతం పట్టలేదు. అదంతా ఒక పిచ్చి" సైన్సును వెనకవేసుకుని ముందుకు ధైర్యంగా వచ్చాను.

"ఏదో ఒకపిచ్చి ఏ పిచ్చయితే నేం లెండి...వెళ్ళివస్తే బావుంటుందండి" సుకుమారహస్తాలను నా బుజాలమీద వేసి ప్రాధేయపడుతున్నట్లుగా నా ముఖంలోకి చూచింది. అరుణ తిలకశోభితమైన శ్రీమతి అమాయక ముఖారవిందాన్ని అదేపనిగా పరిశీలిస్తూ చిన్నగా తలవూపాను. "అయితే, రెడీ. నాకు తెలుసు మీ రడుపెట్టరని. ఇక బయులుదేరండి. ఇందుకే త్వరగా రమ్మన్నాను." చెయ్యి పట్టుకుని కుర్చీలోంచి లేపుతూ అంది.

వెళ్ళగానే శాంత మా శ్రీమతిని గుర్తించి కుశలప్రశ్నలు వేసిందికాని వంటనే మతిచలించి పిచ్చపిచ్చగా కేకలువేయడం, తనలోతనే నవ్వుకోవడం, యేడ్వడం మొదలయిన భయంకర కృత్యాలన్నీ చేసింది. ఆ సమయంలో ఆమెవంక చూడాలంటే నావంటి ధైర్యవంతుడు చాలడు.

దయ్యాలమీద నాకున్న అభిప్రాయం చూచాయగా రామారావుగార్కి సంభాషణలలో తెలియజేసి డాక్టర్లకు చూపించారా అని అడిగాను. అన్నీ అయి భూతవైద్యందగ్గరకు వచ్చిందని నిరాశగా జవాబిచ్చాడా వృద్ధ జమీందారు.

శాంత విపరీతచర్యలు చేస్తున్నప్పుడు కూడా మా శ్రీమతి ధైర్యంగా పలుకరించ ప్రయత్నించింది. తిరిగి యిల్లుచేరినప్పటినుంచి నాకు సైన్సు యీ విషయంలో కరెక్టా కాదా అని సమస్య యేర్పడింది. ఒక్కొక్కప్పుడు సైన్సుకు లొంగని కొన్ని కేసులు భూతవైద్యులు హుష్మని పోగొడతారు.

శ్రీమతి భోజనానికి లేవమని పిలచేవరకూ అదే ప్రాబ్లం గురించి ఆలోచిస్తున్నారు.

"శాంతపరిస్థితి చూచారుగా పెద్ద దయ్యాలు లేవని కోతలుకోస్తారు." అనే సరికి నన్ను, ముఖ్యంగా నా M. Sc డిగ్రీని ఎత్తిపొడిచినట్లైంది.

ప్రశాంత వాతావరణంలో శశి నీలాకాశంలో తారలతో సరససల్లాపాలాడుతున్నాడు. వాయుదేవుడు దూది పింజలవంటి మేఘాలతో బంతులాట లాడుతున్నట్లుంది. బాల్కనీక్రింద నైట్‌క్వీన్ పరిమళాన్ని నలుదిక్కులకు వెదజల్లుతోంది. రోడ్డంతా నిర్మానుష్యంగావుంది. అప్పుడే నాతో మాట్లాడడానికి వచ్చిన స్నేహితుల్ని పంపేశాను.

బెడ్‌రూమ్‌లో శ్రీమతి ప్రశాంతంగా నిద్రపోతోంది. చిరుగాలికి రేగిన ముంగురులు ఫాలభాగంమీదపడి అటూయిటూ కదలుతూవున్నై. చిరునవ్వు వీడని మృదుమధురాధరము నన్ను వెక్కిరిస్తున్నట్లుగా వుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసలకు చలిస్తున్న వక్షస్థలం తీయని కోరికలను రెచ్చగొడుతోంది... ఉజ్వలమైన దీపకాంతిని అంకురింపజేశాను.

ఎంతప్రయత్నించినా నిద్రరావడం లేదు. పిచ్చపిచ్చ ఆలోచనలు మనస్సులో స్థావరం యేర్పరచుకుంటున్నాయి. మా శ్రీమతి ఉద్దేశ్యం ప్రకారం దయ్యంపట్టిన శాంత భయంకరాకృతి కళ్ళకు కట్టినట్లుంది... ఆ విధంగా యెంతకాలం గడచిపోయిందో తెలియదు.

డ్యూటీ అయిపోయినట్లుంది శశి సాగర గర్భంలోకి అంతర్ధానమైనాడు.

స్వతంత్రత సంపాదించుకున్న నిశి తన గాఢత్వాన్ని చూపిస్తోంది. మధ్య మధ్య చిన్న కునుకుపాట్లుపడుతున్నాను. ఏమీ తెలియని మైకంలో అదేవిధంగా పడుకున్నాను.

ఇంతలో గజ్జలమోత వినిపించేసరికి గుండె ఝల్లుమనిపించి వున్న కొస్త నిద్రమత్తు వదలిపోయింది.... గజ్జెలమోత యెక్కడినుంచి వచ్చిందో. ఆ సమయంలో ఎవ్వరు మేలుకొనివుండరే?... ఆలోచనలలో అనుమానం, భయం భాగాలు పంచుకుంటున్నై... మరొకసారి అదేవిధంగా గజ్జెలమ్రోత మోగింది. హఠాత్తుగా శాంత, దయ్యాలు గుర్తుకు వచ్చినై. దుప్పటి ఆ పాదమస్తకం తన్నిపెట్టాను దయ్యం నడుస్తుంటే గజ్జలు మోగుతున్నాయనిపించి రక్తప్రవాహ వేగం హెచ్చింది.

ముచ్చెమటలు పోయడంతో దుప్పటి తడిసి చల్లచల్లగా వుంది. అటూ యిటూ కదలినప్పుడు బుజాలకు దిండు తగిలినా దయ్యం చేతితో తట్టినట్లనిపించి ప్రాణం పోయినంత పనైంది. దయ్యాలకు నిప్పంటే భయమని మా అమ్మమ్మ చిన్నప్పుడు చెప్పినట్లు జ్ఞాపకం. కాని నిప్పుపెట్టె సమయానికి దగ్గర లేకపోవడంతో యేం చేయాలో తోచలేదు. ఇక నెమ్మదిగా శ్రీమతిని లేపక తప్పిందికాదు.

అలసిపోయివుందేమో, బద్ధకంగా అబ్బ యేమిటండీ యిప్పుడు నిద్రలేపుతారు యేంకావాలి? మంచినీళ్ళా? అంటూ లేచింది. శ్రీమతి ఆ మాటలనేసరికి తడారిపోయిన గొంతుకు మంచినీళ్లు కావాలనే విషయం గుర్తుకువచ్చి అతికష్టంమీద అవునన్నాను.

లైటువేసి గాజుగ్లాసుతో నీళ్లు తీసుకువచ్చి నాకందించింది. ఆతృతగా త్రాగుతుంటే ఆశ్చర్యపోయి చూస్తోంది శ్రీమతి.

"ముచ్చెమటలు పోసే యెందుకండీ" అంటూ నా నుదుటిమీద చెయ్యివేసి చూచింది. ఇంతలో గజ్జలమోత వినుపించింది. ఆ శబ్దానికి శ్రీమతికూడా ఉలిక్కిపడి నా వంక చూచింది.

వెంటనే ధైర్యం తెచ్చుకుని బాల్కనీ క్రింద లైటువేసి కిటికీగుండా తలుపు ఛాటు చేసుకుని క్రిందకు చూచింది. తక్షణమే "ఓసి, ఎంత భయపెట్టావే" అని కిలకిలా నవ్వేసింది. సంగతేమిటో తెలియక పోవడం వల్ల ప్రయత్నంమీద నేనుకూడా నవ్వాను.

శ్రీమతి నెమ్మదిగా నా దగ్గరకు చేరి "ఏమండి యిందుకేనా యీ రాద్ధాంతమంతా?" అని ప్రశ్నార్థకంగా నా వంక చూచింది. జ్యోతుల్లావున్న నా కళ్లను చూచి నేను నిద్రపోలేదని, బహుశః దానికి కారణం యీ గజ్జల దయ్యమే అని శ్రీమతి వూహించింది.

"మీరు గజ్జెలమోతవిని యేమిటేమిటో వూహించుకుని భయపడివుంటారుకదూ. ఎందుకండీ అంత భయం సైన్సు యేమిచెప్తోందో మీకు తెలియకపోతేగా, ఇటు రండి చూపిస్తాను మీ భయానికి హేతువు అంటూ కిటికీదగ్గరకు తిసుకుపోయింది.

నైట్‌క్వీన్ చెట్లదగ్గరలో వెచ్చగా గుంట చేసుకుని పడుకున్న చిన్న కుక్కపిల్ల చెట్ల పొదులలోనుంచి వచ్చిన నీటి చెమ్మకు అటూ యిటూ కదులుతోంది. దాని మెడలో వున్న గజ్జెలు ఆకదలినప్పుడల్లా మ్రోగుతున్నై. నన్ను భయపెట్టిన గజ్జెలదయ్యం ఆ చిన్న కుక్కపిల్లేనని తెలిసేసరికి పొట్ట చక్కలయ్యేటట్లు నవ్వాను. నన్ను చూచి మా శ్రీమతి కూడా నవ్వేసింది.



# రంగమ్మ నవ్వు

ఇన్నాళ్లుగా లేనిది రంగమ్మకు ఈనాడు నవ్వు వస్తోంది. ఉప్పూ, కారం తినే మామూలు మనిషే అయినా, కావాలని కష్టాలను కొనితెచ్చుకోకపోయినా, వచ్చిన కష్టాలకు తలొగ్గింది రంగమ్మ. తన సంగతి అనేదేదో ప్రత్యేకంగా ఉన్నదని రంగమ్మ ఎన్నడూ అనుకోలేదు. ఓ విధంగా అట్లా అనుకునే అవకాశమే లేకపోయింది రంగమ్మకు.

అయితే ఇన్నాళ్లూ లేని మార్పేదో తనలో వచ్చింది. ఆ సంగతి మొదట ఇతర్లు కనిపెట్టారు. ఇతరులంటే???.........

ఇంతకూ రంగమ్మ ఎవరు? ఇంతమందిలో ఉంటూనే ఒంటరి ననుకునే మనుషులలో ఒకతె రంగమ్మ. కోటంతకొంపలో ఒంటరిగా ఉంటూనే మొక్కలనూ, ఇంట్లో పెంచే కుక్కలనూ తనతో బుట్టినవాళ్లుగా ఊహించుకోగల వ్యక్తి రంగమ్మ.

ఇరుగు పొరుగులోని తన ఈడు అందగత్తెలు పిల్లాజెల్లతో సరదాగా ఉండడం చూచి తనకూ అటువంటి సుఖం కావాలన్న పేరపేర కలిగినా తనలోనే ఆ కోరికను దాచుకోగల యువతి రంగమ్మ.

గారాబంగా పెరగలేదు రంగమ్మ. పెద్ద పెద్ద చదువులు లేవు. తల్లి చిన్నతనంలోనే పోవడంవల్ల ఇంటికి తానే ఆడదిక్కయి పని పాటలు బాగా నేర్చుకొన్నది. ఎనిమిదేళ్ళ రంగమ్మ ఇల్లలికి ముగ్గులుపెట్టి తండ్రికి కాచి వసపోయడం ఇరుగుపొరుగుకేనేమిటి ఊరంతటికీ ఆశ్చర్యంగానే ఉండేది మొదట్లో.

ఇక రంగమ్మ తండ్రి రాజయ్యకు తల్లిదండ్రులు ఆ పేరు పెట్టినందుకు అనాలి. జీవితమంతా రాజకీయాలతో నేసరిపోయింది. అయితే స్వగ్రామంలో రాజకీయాలలో మాత్రం వేలుపెట్టేవాడుకాదు. ఒక పార్టీ అనేమీ లేదు. ఉప్పుసత్యాగ్రహంలో జైలుకు వెళ్ళివచ్చాడు. నాలుగెకరాల మాగాణి సొంతంగా సేద్యంచేసేవాడు. మంచి అనితోస్తే ఏ రాజకీయపార్టీ ఇచ్చిన కార్యక్రమాన్నయినా సరే అమలు జరిపేవాడు. రేషన్ రోజులలో పేదలకు కమ్యూనిస్టులు కిరసనాయిలూ, బియ్యమూ, గుడ్డలూ ఇప్పించాలని ఆందోళన ప్రారంభిస్తే రాజయ్య

ఏ. ఎస్. అవధాని

సమర్థించాడు. డిప్యూటీ కలెక్టరు దగ్గరికివెళ్ళి ప్రాధేయపడి నెలకు ఆరు డబ్బాల కిరసనాయిలూ, నలభయి బస్తాల బియ్యమూ కోటా చేయించాడు. అమ్మకానికి ఎవరికి ఇవ్వాలి అని పంచాయతీ అధ్యక్షుడు అడిగితే పంచాయతీయే సరుకు తీసుకొచ్చి సక్రమంగా పేదలకు మాత్రమే అమ్మాలని పట్టుపట్టాడు. అట్లా కొన్ని రోజులు గడిచిన తరువాత కమ్యూనిస్టులు ఏవో అఘాయిత్యాలు చేశారని తెలిసి, స్వయంగా చూచి కొందరిని అరెస్టు చేయించాడు రాజయ్య.

పంచాయతీ ఎన్నికలలో ఊళ్లో గలభాలకు కారణం అయినారని తాలూకా, జిల్లా కాంగ్రెసు సంఘాల కార్యకర్తలతో పేచీ పడ్డాడు రాజయ్య.

అన్ని రాజకీయ పక్షాలలోనూ రాజయ్యకు స్నేహితులున్నారు. విరోధులు కూడా ఉన్నారు. ఇంతకూ ఇటువంటి రాజయ్య పెంపకంలో పెరిగిన రంగమ్మ సంగతే ఇప్పుడు మనకు అవసరం. రంగమ్మ అంటే రాజయ్యకు ఎటువంటి ఆపేక్ష ఉండేదో రంగమ్మకే కాదు - రాజయ్యను ఎరిగున్న వాళ్ళల్లో చాలా మందికి కూడా తెలియదు.

ఆపేక్ష సంగతి ఎందుకూ? తండ్రికి కూతురిపై ఆపేక్ష ఉండదాయేం? అందులోనూ ఒక్కగా నొక్కతే అయితే కూతురి మీద కాక మరెవరి మీద తండ్రికి ఆపేక్ష ఉంటుంది? మిగతా తండ్రుల సంగతేమోగాని రాజయ్యకు మాత్రం ఈ సూత్రం వర్తించదు. ఎందుకనంటే ఆపేక్ష అనడానికిగాని, ఆపేక్ష లేదు అనడానికి గాని రాజయ్య ఎవరికీ ఎప్పుడూ అవకాశం ఇవ్వలేదు. రంగమ్మ మంచానపడితే రాజయ్య మందు ఇప్పించక పోలేదు-అన్నం ఉడకేసి పెట్టలేదనీ కాదు.

ఒకసారి రంగమ్మ తండ్రికి చెప్పకుండా మేనత్తగారింటికి వెళ్ళింది. పదిరోజులయినా తిరిగి రాలేదు. "అయ్యో నాకూతురు ఏమయిపోయిందని" రాజయ్య కలతపడలేదు. కూతుర్ని వెంట పెట్టుకుని మేనత్త వచ్చినప్పుడు చెప్పకుండా ఎందుకు వెళ్ళావని రంగమ్మను రాజయ్య దండించలేదు.

ఇంత విచిత్రమైన సంస్కారంగల రాజయ్య పెంపకంలో తయారయిన రంగమ్మకు పంథొమ్మిదోయేటనే పసుపూ కుంకుమ దూరమయినవి. తండ్రి కరువయినాడు.

పొట్ట గడవదన్న భయంలేదు రంగమ్మకి. నాలుగెకరాల మాగాణీ తన పేరనే వ్రాశాడు రాజయ్య. ఇల్లు కూడా తన పేరనే ఉన్నది. హాయిగా చదువుకుందాం అని తండ్రి పోయిన మొదట్లో అనుకున్నది రంగమ్మ.

చిన్నప్పుడు—అదే రజస్వలకాకముందు అయిదో తరగతి పూర్తి చేసింది. బస్తీకి వెళ్ళి ప్రైవేటు పంతులును కుదుర్చుకొని ఆరు నెలలు తంటాలు పడింది. చదువు రాదేమో ననిపించింది. చదువువచ్చినా రాకపోయినా ఆ ఆరునెలల్లోనే చాలా అనుభవం సంపాదించింది రంగమ్మ. ఆ అనుభవంలోని కష్ట సుఖాలు కళ్లకుకట్టినట్టుబస్తీలో కనిపిస్తున్నవి. కళ్ళు తెరిచి చూడగలిగితే విషయాలు తెలుస్తయని తన తండ్రి అంటూండేవాడు. అదేమిటో ఆ ఆరు నెలల్లోనూ రంగమ్మకు అర్థమయింది.

"ఛా...ఈ చదువూవద్దూ. ఈ వేషాలూ వద్దు" అనిపించింది రంగమ్మకు. అది రాజయ్య రంగమ్మకు ఇచ్చిన సంస్కారం!!

ఆ రావడం రావడం రంగమ్మ ఈ అయిదేళ్లలోనూ మళ్లీ ఊరు వదిలిపెట్టి ఎక్కడికీ వెళ్లలేదు. తన నాలుగెకరాల కొండ్రా మేనత్త మొగుడు రాఘవయ్య సాగుచేస్తు

న్నాడు. రెండు రోజుల కొకసారివచ్చి కులాసాగా ఉన్నావా అని అడిగి కష్ట సుఖాలు కనుక్కుపోతూంటాడు.

రాజయ్య ఇచ్చిన రాటం ఉన్నది. రాజయ్య చదివివెళ్ళిన భగవద్గీత, భాగవతం, రామాయణం ఉన్నవి. బస్తీనుంచి తను రెండు కుక్కపిల్లలనూ, రెండు పిల్లులనూ తెచ్చింది. దొడ్లో మొక్కలు వేసింది. అవన్నీ పెరిగి ఓ చిన్న తోటయింది.

ఈ విధంగా ఒడిదుడుకులులేని దున్నపోతుల బండిలాగా సాగిపోతున్న రంగమ్మ జీవితంలో ఇన్నాళ్ళకు 'నవ్వు' మొలిచింది!!

తనో అందాల కుప్ప అని రంగమ్మ ఎన్నడూ అనుకోలేదు.

కాని? ఇదివరకులేని మార్పేదో తనలో వచ్చింది. మేనమామ పెద్దకొడుకు, అయిదో క్లాసుదాకా చదువు చెప్పిన పంతులు నరసయ్యగారి పెద్దబ్బాయీ, ఎదుటింటి మునసబుగారి తమ్ముడూ తన ఇంటికి వచ్చిపోతున్నారు. వచ్చిపోతే యేం? ఇంకా చాలా మంది వస్తున్నారు. కొంచెంసేపు లోకాభిరామాయణమేదో మాట్లాడి వెళుతున్నారు. అంతమాత్రాన మునుచుకుపోయిందేమీ లేదు. మగవాళ్ళతో మాట్లాడితేనే సిగ్గుదొంతరలు ముంచుకువచ్చేకుసుమకోమల గాత్రి కాదుతను

సంసారసుఖం తెలియని మనిషి కాదు తను. కాని...కాని...మేనమామ కొడుకూ, పంతులుగారి పెద్దబ్బాయీ, మునసబుగారి తమ్ముడూ తన ముఖంలోకి అదేపనిగా చూస్తున్నారు. తనతో మాట్లాడుతూ సందర్భం లేకుండా అదేపనిగా నవ్వుతారు. తనతో మాట్లాడుతూ, మాట్లాడుతూండగా వాళ్ళ గొంతులెందుకో బొంగురుపోతవి.

ఇదంతా రంగమ్మకు నవ్వులాటగా ఉన్నది.

పంతులు నరసయ్యగారి పెద్దబ్బాయి బియ్యే చదివాడు. పెళ్ళయింది. సంసారం చేస్తున్నాడు.

మేనమామ కొడుక్కు నలుగురు పిల్లలు.

మునసబుగారి తమ్ముడికి ఇంకా పెళ్ళి కాలేదు. కాని, ఆడవాళ్ళవల్లపొందే సుఖం యేమిటో బాగా తెలిసినవాడు.

మరి వీళ్లు తనను ఈ దృష్టితో ఎందుకు చూస్తున్నారూ? ఇంతా చేస్తే ఈ మగ వీరులకు తన కుక్కలను చూస్తే చచ్చేభయం. పెద్దకుక్క రాణి. అది వాకిట్లో పడుకొని ఉంటే తను దగ్గరున్నా లోపలికి రావడానికి భయపడే ధీరులు!!!

పోనీ ఆ కాస్తమాటా, తనతో చెపితే యేం? తనను అడిగితే యేం? అడగరు. సాయంకాలం ఏ నాలుగు గంటలకో వచ్చి రాత్రి ఎనిమిదింటి దాకా కదలరు. ఏవేవో ఖబుర్లు చెపుతారు. హావభావాలూ, వికిలి చేష్టలు కనిపిస్తవి. అంతేగాని,......

ఓసారి మునసబుగారి తమ్ముడు ఏదో పత్రిక తెచ్చి ఓ కథ చదివి వినిపించాడు. తీరిగా విన్నది తను. ఆ పత్రిక తనకు ఇవ్వబోతున్నట్టు తన చేతితో చెయ్యి కలపచూచాడు. రంగమ్మ అది గమనించలేదు. తీరా గమనించిన తరువాత ఓసారి అదో రకంగా అతనికేసి చూచింది. ఇక ఆ తరువాత నాలుగు రోజులు తన ఇంటికి రావడానికే ఆ యువకుడు జంకాడు.

మరొక రోజు.

స్నానంచేసి రంగమ్మ ఇంట్లోకి వెళ్తూండగా మేనమామకొడుకు వెనకనుంచి నెమ్మదిగా లోపలికి వచ్చాడు. పడకగది తలుపువేసుకోడం మరచిపోయింది. లోపలికివెళ్ళి చీర కట్టుకుంటూండగా తనను

......................

ఆ తరువాత "ఏమిటి...బావా...ఇది!" అన్నది రంగమ్మ.

"............"

"ఏం బాగాలేదు. నేను మీ ఇంటికి వస్తాను ఇవాళ్ల సాయంకాలం. లేదా మామయ్యను ఓసారి రమ్మని చెప్పు ఇక్కడికి......"

"ఏం...ఎందుకూ..."

"ఎందుకేమిటే? ఈ వరస నాకేమీ బాగాలేదు. ఇటువంటి పంపని మీ నాయనకు తెలిస్తే బాగుంటుంది."

"చెప్పూ... నువ్వు ఇటువంటి దానివనికూడా ఆయనకు తెలిస్తే బాగుంటుంది."

"అవును. నేను ఎటువంటి దానినో మీ అందరికీ తెలుసు. కాని అందుకు నేనేమీ బాధపడను. నీసంగతే మీనాయనకు బాధ కలిగిస్తుంది. నేను మంచిదాన్నని మీ అందరితోనూ ఎన్నడూ చెప్పుకోలేదు. ఆఖరికి మీ ఇంటికి ఇంతవరకూ ఓ పూట తిండికి కూడా నేను ఎన్నడూ రాలేదు. నా మానాన నేను పడిఉంటున్నా. ఇట్లా వెంటపడి ఆఖరికి నాకొంప కూల్చావు. ఇక దయచెయ్యి చాలా గొప్పవాడివి," అన్నది తను.

అంతే మళ్ళీ ఆ బుద్ధిమంతుడు నెలరోజుల దాకా తన ఇంటికేసి రాలేకపోయినాడు.

ఆ నెల రోజులలోనూ తను అతని కోసం చాలా సార్లు ఎదురుచూచింది. కారణం? ఎన్ని సంవత్సరాల కిందటనో ఆరిపోయిన తనలోని ఈ మంటను ఈ మగధీరులు రెచ్చగొట్టారు. ఏ పని చెయ్యపోయినా ఉత్సాహంగా ఉండడంలేదు. ఎందుకూ? అనే ప్రశ్న ఒకటి ఎప్పుడూ వేధిస్తోంది.

ఇదే తనలో వచ్చిన మార్పు. ఈ మార్పువల్లనే రంగమ్మకు ఈ నాడు నవ్వు వస్తోంది.

తన సంగతి ఇట్లా ఉండగా ఊళ్లో వాళ్లు రకరకాల పుకార్లు ప్రచారం చేస్తున్నారు.

పైగా మునసబుగారి తమ్ముడూ, మేనమామకొడుకే ఈ ప్రచారానికి సారథ్యం వహించారని ఆరాతీయగా తెలిసింది తనకు.

ఇంతవరకూ అటువంటి సాహసానికి దిగని పంతులుగారి పెద్దబ్బాయికి వీళ్లిద్దరూ తమ 'ఘనతనూ' అంటకట్టారు! ఎంత గొప్పవాళ్ళూ? ఇట్లా కాక మరెట్లా వీళ్ళ మగతనం సార్థకం అవుతుంది?

విచిత్రం ఏమిటంటే వాళ్లిద్దరూ మామూలుగా మళ్లీ తన ఇంటి చుట్టూ తిరుగుతునే ఉన్నారు. అయితే ఇదివరకూ అందరికీ తెలిసేట్టు వచ్చేవాళ్ళు.

ఇప్పుడు ఎవరికీ కనిపించకుండా ఉండాలని రాత్రిపూట, తెల్లవారుఝామునా వస్తున్నారు. అందుకని తనుకూడా వాళ్ళకు వీలయినంతవరకూ దూరంగా తప్పుకు తిరగడానికి వీలవుతున్నది.

అందుకే రంగమ్మకు నవ్వువస్తోంది. ఈ మార్పు చాలా పెద్దమార్పు. ఆ సంగతి తనకు తెలిసినంతగా ఇతరులకు తెలియదు. కాని, పంతులుగారి పెద్దబ్బాయి సంగతి రంగమ్మకు మరి నవ్వు తెప్పిస్తోంది. ఈ వదంతి బయిలుదేరిన తర్వాత పాపం ఆయన తన ఇంటికి రావడమే మానివేశాడు. ఒకసారి వస్తే బాగుండునని రంగమ్మకు అనిపించితే మాత్రం విచిత్రమేమిటి? ★

# అదుగో



భద్రాద్రి గోదావరీతీరంలో సూర్యాస్తమయ సమయ సౌందర్యం.

అనుకోకుండా ఈయేడు ముక్కోటికి పదిమందిమి జట్టుగా కలిసి భద్రాచలం వెళ్ళాము.

తెల్లవారుజామున మూడు గంటలకు రాజమండ్రి లాంచీరేవుకి చేరుకున్నాము. కొబ్బరికాయలు కొట్టి రామస్మరణతో మూడున్నర గంటలకి గోదావరిలో లాంచి వదిలారు. ఉదయం పదిగంటలకి లాంచీ పోలవరం చేరింది.

అక్కడ కాఫీ, టిఫిను తీసుకున్న తర్వాత, పదకొండు గంటలకు మళ్లీ లాంచి బయలుదేరింది. ఇరుప్రక్కలా వున్న పెద్ద పెద్ద కొండల మధ్యగా, పచ్చని పొలాల మధ్యగా లాంచీ పోతూంది. కొండల దిగువ భాగమంతా పంటలుపండిస్తున్నారు. ప్రతి కొండమీదా రకరకాలచెట్లూ కనులపండుగగా కనుపిస్తున్నాయి.

ఒక కొండకి గండి ఏర్పడింది. దానిని "పోచమ్మ గండి" అంటారు. భక్తు లందరూ కొబ్బరికాయలు కొడతారిక్కడ.

సాయంత్రం ఆరున్నర గంటలకి మా లాంచీ కూనవరం చేరింది. అక్కడే స్నానాలుచేసి బట్టలు మార్చుకున్నాము. లాంచీరేవు పెద్ద ఇసుకపర్ర. అక్కడ ఒక చిన్న హోటలుకూడా వుంది. ఊరుఅక్కడికి ఆరుఫర్లాంగు లుంటుంది. ఆ ఇసుక ప్రదేశంలోనే పొయ్యిలు పెట్టుకుని ఆహార పదార్థాలు తయారు చేసుకున్నాము. జాతి మత భేదాలు లేకుండా ఆ ఇసుక ప్రదేశంలోనే వండుకొని అందరూ భోజనం చేస్తుంటే ఎంతో చూడముచ్చటగా ఉంది. కాని ఆ ఇసుక పంటికింద పడకుండా చూసుకునేసరికి తాతలు దిగివచ్చారు! మా లాంచీలోని అందరం కొద్దిసేపు రామనామం చేశాము. కొందరు పాటలు పాడారు. పిమ్మట అందరం నిద్రాదేవి ఒడిలోకి చేరాము. మా లాంచీ

మరునాడు ఉదయం ఆరుగంటల
కూనవరంనుంచి బయలుదేరింది.

అలా కొద్దిదూరం వెళ్ళేసరికి, పా
కొండలు వచ్చాయి. రెండు వైపులా వున్
బ్రహ్మాండమైన ఈ కొండల మధ్యనుం
లాంచీ మెల్లిగా వెడుతుంది. అక్క



భద్రాచల రామాలయ

# భద్రాద్రి!

నీరు బహునిశ్చలంగా వుంటుంది. నీటి లోపలకూడ కొండలు ఉన్నాయిట! ఈ పాపి కొండలు, కొండకి కొండకీ మధ్య ఖాళీలే కుండా పెద్ద రాతిగోడవలె ఆకాశాన్నంటు కుంటాయి. కొండల మధ్యనుంచి వెళ్తు తూంటే భయం, ఆనందంకూడ కలిగాయి. లాంచీవాళ్ళు ఆప్రదేశంలో విస్తారం గ్గ



భద్రగిరి రామభద్రాలయ దృశ్యం.



ంలో ఉత్తరగోపురద్వారం

మాట్లాడనీయరు. మనుష్యులను అటు ఇటు లాంచీలో తిరుగనీయరు. రామ నామం తోటి, కొబ్బరి కాయల మోతతోటీ మా లాంచీ మారుమోగింది.

మధ్యాహ్నం రెండుగంటలకి పవిత్రస్థల మైన భద్రాచలం చేరింది. కోవెలకి, గోదావరికి, బజారుకి దగరగా వుంటుందని సత్రంలో ఒకగది అద్దికి తీసుకున్నాము.

గోదావరిలో స్నానంచేసి "పొట్టపూజ" చేసుకున్నాము. ఎక్కడికెళ్ళినా, మొదట జఠరాగ్నిని శాంతింప జేయాలికదా!

ఆ భద్రాద్రి రఘురాముణ్ణి చూడడానికి మా మనసులు ఉవ్విళ్ళూరుతున్నాయి. ముందర కోవెలకి బయలుదేరాము. కోవెల ఇంకా పదిగజాలుండనగానే, వికలాంగులు ముష్టివాళ్ళు బట్టలు పరుచుకు కూచున్నారు. వీళ్ళ ఆర్తనాదాలు వింటుంటే అపరిమిత మైన దిగులు విచారం వేస్తుంది. పరికించి చూస్తే, వారిలో కొందరిది నటనకాకపోదు. ఏది యేలాగైనా వారికి నాలుగు డబ్బులు సంపాదించిపెట్టే సమయమిదేగదా!

రామాలయాన్ని కొండమీద కాకుండా క్రింద కాకుండా ఒక పెద్ద దిబ్బమీద కట్టారు. అందుచేత, పెద్దపెద్ద రాతిమెట్లు ఎక్కి గుడిలోకి వెళ్లాలి. రక్షకభటుల, బాలభటుల సహాయంతో అభద్రాద్రి రఘు రాముని మూలవిరాట్‌ని దర్శించాము. తరువాత ఉత్సవ విగ్రహాలదగ్గరకు వెళ్ళాము.

ముక్కోటి పదిరోజాలుండనగానే, రాములవారికి దశావతారాలు వేస్తారు. ప్రతి అవతారం కౌసల్యాదేవి తండ్రిగారిని దర్శించాలట. తాతగారిసుడికి రామలక్ష్మణసీతామ్మవారిని మేళతాళాలతో

(56-వ పేజీ చూడండి)

## శ్రీరామ నవమి

[8-4-57]

సీ॥ వెలయ పంద్రెండవ
నెలయందు చైత్ర పు
నర్వసు బుధ శుద్ధ నవమి
నాడు
పంచగ్రహాంబులు పరగ
నుచ్చస్థాన
గతులుగా గురు సుధా
కరులు గూడ
గర్కట కాఖ్యలగ్నము
నందు గౌసల్య
హారికర్థమగు రామునమర
గనియె.

... ... ...

—భాస్కరరామాయణము.]

# అపరబుద్ధి

డిటెక్టివ్ సీరియల్

(గత వారం తరువాయి)

ప్రమాద భీమాపట్టా తాలూకు యాభైవేల రూపాయలు ఇవ్వాలని కోమలం భీమా కంపెనీమీద తన ప్లీడరు ద్వారా నోటీసు పంపి, తరువాత దావా వేసింది. డాక్టరు చంద్రశేఖర్ ప్రమాదంవల్ల మరణించినట్టు రుజువు కానందున, భీమా కంపెనీకి ఈ మొత్తం ఇవ్వవలసిన బాధ్యత లేదని కంపెనీ మేనేజింగుడైరెక్టరు వాదం. ఈ సందర్భంలో మందుల షాపులోని టెలిఫోను ద్వారా ఆమె దాదాపు పదిసార్లు నన్ను పిలిచింది. ఎలా వ్యవహరించాలో ఆమెకు చెప్పాను. డాక్టరు చంద్రశేఖర్ ఆత్మహత్యవల్ల మరణించాడనే గాకుండా, మరొక కొత్త విషయాన్నికూడా కంపెనీవాళ్లు రుజువుపరచబోతున్నారనీ ముందుగా జాగ్రత్తపడమనీ ఆమెకు చెప్పాను. నేను అన్ని వివరాలు తెలియపరచలేదు. ఈ కేసు సందర్భంలో హత్య జరిగిందనే విషయంగూడా తనకు తెలియనట్టుగా నటిస్తూ, కంపెనీ డబ్బు ఇవ్వాలని ఆమె తన వకీలుద్వారా వాదిస్తూంది. నాకు ఇది అనుకూలంగానే వుంది. మానవ స్వభావంలో ముఖ్యంగా స్త్రీ ప్రవృత్తిలో ఇదొక సహజగుణం. ఈ విధంగా వాదప్రతివాదాలతో రెండు నెలలు గడిచిపోయినై.

పంచాయతీదారులు తీర్పు చెప్పటానికి ఇంకా ఒక నెలగోజులు పడుతుంది. ఈలోపల మూడు నాలుగు పర్యాయాలు కమలాక్షిని కలుసుకున్నాను. ఆమెను వెన్నెలలో ఒకనాటిరాత్రి పార్కు దగ్గరికి తీసుకువెళ్ళాను. ఇద్దరమూ ఒకేబల్ల మీద కూచున్నాము. ఆమె కళ్ళలోకి చూశాను. నా హృదయానికి అర్థమయ్యే భాషలో ఆమె నేత్రాలు ముచ్చటిస్తున్నవి. ఆమె చేతిని నా చేతిలోకి తీసుకున్నాను.

"ఇలా చేయటం పొరపాటుఅయింది," అన్నాను.

"ఏంలేదు," అంటూ ఆమె నా గుండెల మీద తనతల వాల్చింది.

"నీవు నన్ను ప్రేమించగలవా?"

"నిస్సందేహంగా."

"ఇలా చేయటం ద్రోహం కాదు?"

"అతడు చేసిన దానికంటేనా? నా ప్రస్తుత పరిస్థితిలో మీరు లేకపోతే నాకు ఏం ఆపదలువచ్చేవో!"



తుమ్మలపల్లి
సీతారామారావు



"వాళ్ళు ఇద్దరూ ఇంకా కలుసుకుంటున్నారా?"

"నిన్నరాత్రి వాళ్ళు కారులో వెళ్ళారు. వాళ్లకి కనపడకుండా నా చిన్న కారులో వాళ్లని వెంబడించాను. తోటలో కూచున్నారు. నేనుకూడా చెట్లచాటున దాక్కుని వాళ్ల సంభాషణ విన్నాను. మొదటినుంచి తాను ఆమెను ప్రేమిస్తున్నాననీ, ఆ సంఘటన జరిగేవరకు తనమార్గం నిష్కంటకం కాలేదనీ అతడు అన్నాడు. వాళ్ళు డబ్బును గురించికూడా మాట్లాడుకున్నారు. అతడికి మీరు అప్పుగాఇచ్చినడబ్బు అయిపోయిందట. విశ్వవిద్యాలయం డిగ్రీరాలేదు. డబ్బు ఎలావస్తుందని అతడు అడుగుతున్నాడు. ఈ పని వాళ్ళిద్దరూ కలిసిచేస్తే, ఆమె అతడికి ఎందుకు డబ్బు ఇవ్వదు?"

"అలాగే కనపడుతుంది."

"ఆమెమాటలలో అతడికి డబ్బు ఇచ్చే ప్రసక్తి ఎక్కడా లేదు. ఇంకా చాలా విషయాలు మాట్లాడుకున్నారు. దాదాపు ఒకగంటసేపు ఉన్నారు అక్కడ. వాళ్ల మాటలవల్ల అతగాడికి దీనితో సంబంధం వున్నట్టు కనపడదు. నేను చెప్పగలను. అతడు ఈ పని చేయలేదు."

ఆమె హృదయం ఉద్రేకపూరితమైంది. ఆవేశంతో మాట్లాడుతూంది. ఇంకా ఏదో ముఖ్యమైన విషయం చెప్పదలచుకున్నట్టు కనపడింది. మధుసూదన్‌కి ఈ విషయంతో ప్రమేయం లేదని చెప్పటం మాత్రమే ఆమె ఉద్దేశంగా తోచలేదు.

"నీ అభిప్రాయం స్పష్టపడటంలేదు. ఈ విషయంలో ఇంకా ఎవరో వున్నారనటం నీవు మానలేదు," అన్నాను.

"నా అభిప్రాయం పొరపాటు కాదు. అది మారదు. ఈవిషయం నేను తెలుసుకోవాలి. ఇది ఆమే చేసింది. నాకు తెలుసు. ఆమెను పట్టుకోటానికి ప్రయత్నిస్తాను. నేను చేయదలచిన ఆఖరుపని ఇదే."

"ఎట్లా ?"

"ఆమె మీ కంపెనీమీద దావా వేసింది. ఔనా ? మీకంపెనీ అధికారులను భయపడవద్దని చెప్పండి. నేనువచ్చి మీపక్కన కూచుని, ఇంతవరకు మీకు చెప్పని విషయాలు ఆమెను అడుగుతాను. మా నాన్న మరణించటానికి పూర్వం, ఒకనాటిరాత్రి కత్తితీసుకుని, చక్కగా అలంకరించుకుని బయలుదేరింది. దేనికి ?"

"ఇటువంటి ప్రశ్నలు అక్కడ అడగనివ్వరు. వీటికి విలువవుండదు. నిన్ను ఒక పిచ్చిదానినిగా పరిగణిస్తారు."

"నేను లక్ష్యపెట్టను. అందరూ వినేట్టుగా కేకలు వేస్తాను. ఆమె నేరం గురించి యదార్థ విషయాలు చెప్పేవరకు నేను వూరుకోను," అంది కమలాక్షి.

* * *

కోమలాన్ని హత్యచేయాలనే భావం నాకు ఒకనాటి రాత్రి వేళ కలిగింది. అప్పుడు నా బుర్రలో పెద్దసంఘర్షణ బయలుదేరింది. నేను హత్యచేసిన విషయం, చీకటి మరుగున వున్న ప్రపంచానికి తెలియదు. ప్రపంచం ఈ విషయం తెలుసుకోలేదు. నేను హత్య చేయటం కళ్ళతో చూసింది కోమలంఒక్కతె మాత్రమే. అందువల్ల నా జీవితానికి ఎప్పటికైనా ముప్పు ఆమెవల్లనే కలుగుతుంది. ఆమెను హతమారిస్తే సరి! హత్యచేయాలనే సంకల్పం నాలో స్థిరపడిపోయింది. నా క్షేమంకోసం ఆమెను అంతమొందించటం అవసరం. ఆమెను ఎప్పుడు చంపాలి,ఎక్కడ చంపాలి, ఎట్లా చంపాలి అనే దృఢమైన ఆలోచన నాలో చెలరేగింది. కమలాక్షి నాటి వెన్నెల రాత్రి, తనకు కోమలం మీద వున్న అనుమానం రుజువు అయ్యే వరకూ విశ్రమించనని చెప్పింది. కోమలం నిజం చెపుతుంది. నేను హత్య చేసినట్లు రుజువు చేస్తుంది. అందుకే ఆమెను హత్య చేయటం అవసరం. కమలాక్షిని చూసినప్పుడు నాకు కలిగే సంతృప్తికీ, కోమలం దగ్గర వున్నప్పుడు నేను పొందే సంతృప్తికీ వ్యత్యాసం వుంది. కోమలం నాలో ప్రతీకార కాంక్షను ప్రజ్వలింప చేస్తుంది. కమలాక్షి నాకు మృదు మధురమైన అనుభూతిని కలిగిస్తుంది.

నేను చేసినపని నాకు మానసికంగా వ్యధ కలిగిస్తూంది. డాక్టరు చంద్రశేఖర్‌ని నేను హత్య చేశాననే విషయం కమలాక్షికి తెలియకుండా వుండి, ఆమె నన్ను పెళ్ళి చేసుకుంటే, నా జీవిత శేషాన్ని వలపుల పంటగా మార్చుకుంటాను. ఇలా జరగాలంటే ఒకటే పద్ధతి. ఈ హత్య నేను చేయటం చూసిన వాళ్ళెవరైనా వుంటే, వాళ్ళని నా మార్గం నుంచి తొలగించటమే ఆ పద్ధతి. మధుసూదన్‌ను గురించి, కమలాక్షి చెప్పిన అభిప్రాయంవల్ల నాకు ప్రమాదం రాకుండా రక్షించుకోవాలంటే, కోమలం ఇక జీవించకూడదు. ఆమె చెప్పిన ఇతర వివరాలవల్ల, ఈ కేసు తీర్పుకురావటానికి ముందే, నా కర్తవ్యం నిర్వర్తించాలని స్పష్టమాతున్నది.

మధుసూదన్‌ని స్వేచ్ఛగా వుండనిస్తే, ఎప్పుడైనా వచ్చి కమలాక్షిని నాకు దూరం చేసే ప్రయత్నం జరుపుతాడు. ఈ కేసు విషయంలో అతడి మీద అనుమానం కలిగిస్తే ప్రయోజనం వుంటుంది. పోలీసులను తేలిక మార్గంలో మోసపుచ్చటంకష్టంమధుసూదన్‌కి ఈ విషయంతో సంబంధం లేదని కమలాక్షి గట్టిగా చెప్పలేదు. అతను ఒక పనిచేశాడని ఆమె విశ్వసిస్తే, రెండో పనిని కూడా అతనే చేశాడని నమ్మేట్లు చేయడం ఏమంత కష్టం కాదు.

ఆ రోజు నా సొంతకంపెనీలో మేనేజరు శెలవుపెట్టాడు. ఒక పనిని కల్పించి ఆఫీసులో పనిచేస్తున్న గుమాస్తాను బయటికి పంపాను. మోటారుకార్లమీద అప్పులు తీసుకున్న వాళ్ళందరికి ప్రత్యేకంగా ఫైళ్ళు ఉన్నవి. ప్రతి ఫైలులోను దళసరి కాగితంతో చేసిన ఒక కవరు వుంటుంది. మేము అప్పు ఇచ్చినవాళ్ళ మోటారుకారు స్విచ్ తాళం చెవిని కూడా మేము తీసుకుని అందులో భద్రపరచటం ఒకసంప్రదాయం. ఎవరూ చూడకుండా మధుసూదన్ ఫైలు బయటికి తీసి, ఆ కవరులోని స్విచ్ తాళం చెవిని నా జేబులో వేసుకున్నాను. ఫైలు కట్టకట్టి, మళ్ళీ మామూలు స్థలంలోనే వుంచాను. కవరులో నుంచి నేను తాళంచెవి తీసినసంగతి ఎవరికీ తెలియదు.

అటు తరువాత నేను కోమలాన్ని కలుసుకోవటం అవసరమని తోచింది. ఆమెతో టెలిఫోనులో మాట్లాడటం అనుమానానికి కారణమౌతుంది. అందువల్ల నాకోసం ఆమె స్వయంగా వచ్చేవరకు వేచివుండవలసి వచ్చింది. ఆమెకోసం వరుసగా మూడు రాత్రిళ్ళు కనిపెట్టుకు కూర్చున్నాను. ఒకనాడు టెలిఫోన్ గంట వినపడింది. ఆమే అని నాకు తెలుసు.

"కోమలం! నిన్ను అవసరంగా చూడాలి."

"ఏ వేళకు రమ్మన్నారు?"

"నిన్ను నేను ఎందుకు కలవలేకుండా వున్నానో నీకు తెలుసు. మనం ఇప్పుడు కలుసుకోవటం చాలా ముఖ్యం. కేసు సందర్భంలో కొన్ని విషయాలు మనం మాట్లాడుకోవాలి. ఆ తరువాత మనం దేనికి భయపడవలసిన అగత్యం వుండదనుకుంటాను."

"అయితే మనం కలుసుకోవచ్చునా!"

"అవశ్యం. వాళ్ళు ప్రతిరోజూ నీవుచేసే పనిని తెలుసుకుంటున్నారు. ఇవ్వాళ నాకు ఒక క్రొత్తవిషయం తెలిసింది. నీ దినచర్యను రహస్యంగా పరిశీలించటానికి నియమించిన పోలీసు ఉద్యోగి, ఈరోజు మధ్యాహ్నం రాడు. అది అతనికి విశ్రాంతి సమయం?"

"అదేమిటి"?

"నీ దినచర్యను రహస్యంగా గమనించి రిపోర్టు చేయటానికి ముగ్గురు పోలీసు ఉద్యోగులను నియమించారు. వాళ్ళు వంతుల ప్రకారం పనిచేస్తున్నారు. వాళ్ళవల్ల ఉపయోగకరమైన పనులు ఏమీ జరగలేదు. అందువల్ల ఖర్చుతగ్గించాలని, వాళ్ళలో ఇద్దరిని ఆపనినుంచి తీసివేశారు. ప్రస్తుతం ఒక ఉద్యోగి మాత్రమే ఆపనిలో ఉన్నాడు. అతను ప్రతిరోజూ పదకొండు గంటలకు వెళ్ళిపోతాడు. ఎదైనా పని వుంటేగాని అతను మధ్యాహ్నం మళ్ళీరాడు. అతను వెళ్ళిపోయిన తరువాత, మనం కలుసుకోవాలి."

 

# అపరబుద్ధి



"సరే! అయితే మీరే ఇంటికిరండి."

"కాదు. మనం మీ ఇంటిదగ్గర కలుసుకోవటం క్షేమంకాదు. సాయంత్రం మీ ఇంటికి నీకోసం ఎవరూ రాకుండా చూడు. ఒకవేళ ఎవరైనావస్తే వాళ్లతో త్వరగా పనిముగించి వేయాలి. తొమ్మిది గంటలకు మామూలుప్రకారం పడుకోటానికి నీవెళ్ళు. నీపడకదిగలో అరగంటసేపు విశ్రాంతితీసుకో. రాత్రి పదకొండు గంటలకు, దీపాల వెలుతురువుండని నిర్జనప్రదేశం పార్కు పక్కనే వున్న రోడ్డు మొదట్లోకి కారులో వచ్చి, నా కోసం ఎదురుచూస్తూ వుండు. అక్కడికి వస్తాను. పోలీసు అధికారికి ఎలాంటి అనుమానానికీ అవకాశం వుండదు," అని సలహా ఇచ్చాను.



మామూలు పద్ధతిలో మధుసూదన్ ఆరాత్రి అక్కడికి వచ్చి ఆమెను కలుసుకోవటము జరుగదు. అతణ్ని అక్కడికిరాకుండా తప్పించటమే నాకు కావలసింది. నేను ఆమెను కలుసుకోటానికి పూర్వమే అతడు ఇంట్లో పడుకుంటాడు. నాకు అతడి మోటారుకారు కావాలి. నేను ఆ మోటారు కారులోనే వెళ్ళాలి. ఒక పోలీసు అధికారి ఆమె దినచర్యలు పరిశీలించటటానికి నియమితుడైనాడని నేను చెప్పినదంతా అబద్ధమే. నన్ను కలుసుకోటానికి ఆమెకు ధైర్యం కలగాలి. అందువల్ల ఏమీ ప్రమాదం వుండదని ఆమెకు విశ్వాసం కలగటం అవసరం. ఎంతమంది పోలీసుఅధికారులను నియమించింది, ఆమెకు తెలియకుండానే ఎంతమంది ఆమెను వెంబడించేది నాకు అనవసరం. నేను చేయాలనుకున్న పని జరగటానికి పూర్వం ఆమెను ఎవరైనా పోలీసు అధికారి తెలియకుండా వెంబడించడం కూడా మంచిదే. నన్ను పట్టుకోవాలంటే, ఆమెనువెంబడిస్తూ ఎవరైనా రావాలి. కాని మధుసూదన్ అక్కడ వుండగా, పోలీసులు ఆమెను చూడటం తటస్థిస్తే ఇంకా విచిత్రంగా పరిణమిస్తుంది.

ఆ సాయంత్రం నాలుగు గంటలకు నా కారులో బయలుదేరి వెళ్లాను. నేను చేయాలనుకున్న పని విషయమై నాకు నిశ్చితమైన అభిప్రాయం వుంది. అది నెరవేరాలంటే, ఒక నిర్దుష్టమైన కార్యవిధానం నిర్ణయించుకోవాలి. పార్కుదాటి ఇంకా కొంతదూరం వెళ్ళి నా కారును నిలపటానికి సరి అయిన ప్రదేశం కనిపెట్టాను. అక్కడికి కొంచెము దూరములో మధుసూధన్ కారు నిలపటానికి ఇంకొక ప్రదేశం నిర్ణయించాను. ఆ ప్రదేశములో రోడ్డుప్రక్కన చెట్లు గుబురుగా పెరిగి వున్నై. వీటెనిదాటి, లోపలికి కొంచెము దూరము నడిస్తే ఆరుబయలు, కాలువలో ప్రవహించే నీళ్ళు కనపడతై. పార్కుదాటి కొంతదూరం వచ్చి రోడ్డుమలుపు తిరగగానే ఎత్తయిన కొండ, చిన్న గుట్టలు వున్నవి. ఈ ప్రదేశం సురక్షితమైన స్థలమని నాకు తోచింది. కొండమీదికి వెళ్లటానికి కంకర రోడ్డు వుంది. లోతైన లోయలు, గుట్టలు, బారులుతీరి పెరిగినచెట్లూ అన్నీ బహు ఆకర్షణీయంగా వున్నై. ఇక్కడికి కాలినడకన ఎవ్వరూ వెళ్ళరు. మోటారుకార్లలోను,గుర్రాలమీదమాత్రమే వెడుతూ వుంటారు. రెండు కార్లనూ ఎక్కడ ఎంతెంతదూరంలో వుంచాలో నిర్ణయించుకున్నాను. కొండపైకి వెళ్లటానికి ఒక కాలిబాట వుంది. కాలిబాటకు సమీపంలోనే నాకారు వుంచటానికి ఏర్పాటు చేసుకున్నాను. ఆమె రాగానే మోటారు కారు తలుపు తెరిచి ఆమెను ఎక్కించుకుని కొండపైకివెళ్లాలి. వెళ్ళినకొద్ది రోడ్డు వెడల్పు తగ్గిపోతుంది. కొండ శిఖరం దగ్గర వున్న

తలుపుకింద లోయ దాదాపు రెండు వందల అడుగులు లోతున వుంటుంది. అక్కడికి రాగానే, సంభాషణధోరణిలోవుండి, కొండ శిఖరం దగ్గరినుంచి ప్రమాదంవల్ల మరణంజరిగి నట్టు కారును లోయవైపు మరలించాలి. భయంతో ఆమె తలుపు తెరుచుకుని క్రిందికి దూకుతుంది. క్రింద అగాధమైన లోయ. నేను కూడా వెంటనే అవతలివైపు నేలమీదికి దూకాలి. అప్పుడు ఎలా చేయా ల్సింది ఒకసారి ముందుగానే సాధన చేశాను. నేను ఆశించిన ఫలితం కలుగుతుంది. నాకు స్ఫురించిన మార్గం ఇదొక్కటే. అక్కడి నించి వెంటనే నేను కాలిబాటవద్దకు నడిచి రావాలి. అక్కడవున్న నా కారుఎక్కి వెళ్లి పోవాలి. ఈ ప్రమాదాన్నిగురించి వలు గురా తెలుసుకుని అక్కడికి చేరటానికి పూర్వమే, నేను సురక్షితమైన స్థలానికి చేరు కుంటాను.

*   *   *

ఇంటికి వెళ్లాను. భోజనంచేసి ఆ రోజు దినపత్రికలో వూళ్లో ఎక్కడఏసినిమావుందో చూశాను. ఒక హాలులో ప్రదర్శిస్తున్న సిని మాలో నా స్నేహితు డొకడు వేషం వేశా డు. ఆ హాలుకు వెళ్లటానికి నిశ్చయించుకు న్నాను. చేతి గడియారం చూశాను. ఎనిమిది గంటల నలభై నిమిషాలు అయింది. కారులో బయలుదేరి ఆఫీసు దగ్గిరికి వెళ్లాను. లోపల లైట్లు వెలుగుతున్నవి. పాండ్య లోపలినుంచి బయలుదేరి వీధి గుమ్మం దగ్గరకు వచ్చాడు. నేను ఆరోజున చేయించిన భీమా కాగితాలు జేబులోనే ఉన్నవి. వాటిని ఆఫీసులో పెట్ట టానికి, ఇంకా కొన్ని కాగితాలు తీసు కోటానికి వెళ్లాను.

“కృష్ణమోహన్! ఇప్పుడు వచ్చావెం దుకు?” అన్నాడు పాండ్య.

“ఇవ్వాళ చేసిన కొన్ని ఫారాలు నాదగ్గర ఉన్నవి. వాటిని ఆఫీసులో పెట్టాలి. ప్రపో జల్ ఫారాలు తీసుకోవాలి. రేపు ఉదయమే ఒకరిని కలుసుకోవాలి. నాదగ్గరవున్న ఫారాలు అయిపోయినై. కొత్తవాటిని తీసుకుం దామని వచ్చాను,” అని జవాబు చెప్పాను.

“నీవు చాలా బాధ్యతతో శ్రద్ధగా పని చేస్తావు. నాకు తెలుసు. అందరూ నీలాగే పనిచేస్తే, అది వాళ్లకీ, కంపెనీకి కూడా చాలా లాభిస్తుంది,” అంటూ నవ్వుతూ వెళ్లి పోయాడు.

నేను మేడమీదికి వెళ్ళి, నాగదిలో కాగి తాలు పెట్టి కావలసినవి తీసుకొని బయటికి వచ్చాను. తిన్నగా సినిమాహాలుకు వెళ్ళి ఒక నోటేసు తీసుకుని టికెట్టు కొన్నాను. ఐస్ క్రీం పార్లర్‌లోకి వెళ్ళి కూర్చున్నాను. ఆ సినిమా చూటటానికీ, ఇంకొక కంపెనీ ఏజంటు నా స్నేహితుడు కూడా వచ్చాడు. అక్కడ కలుసుకున్నాం ఇద్దరము. అతణ్ణి ఆహ్వానించాను. ఇద్దరం ఐస్ క్రీం తింటూ, కొంచంసేపు వ్యాపారవిషయాలు ముచ్చ టించుకున్నాము. ఆసినిమాలో నాస్నేహితు డొకడు వేషం వేశాడనీ, అతడి వేషం చూడటానికి వచ్చాననీ చెప్పాను. సినిమా ప్రారంభించటానికి మొదటిగంట కొట్టారు. అప్పుడే హాలునిండా జనం చేరారు. దీపాలు వెలుగుతూండగానే, ఇద్దరం లోప లికి వెళ్లాము. నేను సినిమా హాల్లోకి వెళ్లటం నన్ను ఎరిగున్నవాళ్లు చూశారు. నాకు కావలసింది అంతే. ఇద్దరికీ సీట్లు ఒకేచోట ఖాళీగా లేవు. అందువల్ల ఇద్దరం చెరొక చోటా కూచున్నాము. సినిమా ప్రారంభమై పదినిమిషాలైంది. నేను హాల్లోనుంచి బయ టికి వచ్చేశాను. నా స్నేహితుడు నేను సినిమా చూస్తున్నాననే దృష్టిలోనే వుం టాడు. వెంటనే కారులో పార్కుదగ్గర రోడ్డుమీదికి వెళ్లాను. అక్కడ నుంచి సరా సరి మధుసూదన్ వుంటున్న ఇంటికి వెళ్లాను. అతడి గదిలో దీపాలు వెలుగుతున్నై. అతడు ఇంట్లోపడుకునే వుంటాడు. ఆ మేడమీది గదు లలో చాలామంది అద్దెకు ఉన్నారు. మేడ క్రింద వరుసగా మోటారుకారు షెడ్లు ఉన్నై. మధుసూదన్ కారు 11 వ నెంబరు షెడ్‌లో వుంటుందని నాకు తెలుసు. అక్క డికి వెళ్ళి తలుపు తెరిచి కారును ఎవరూ చూడకుండా బయటికి తీసుకువచ్చాను. అతడి కారును నా కారు నిలచిన స్థలానికి కొంచెందూరానికి తీసుకువెళ్ళి, రోడ్డు ప్రక్కగా ఆపి, ప్రక్కన దట్టంగా పెరిగిన చెట్లు, పొదలు చూస్తున్నాను. అప్పటికి పద కొండు గంటలైంది. కోమలం వచ్చిందేమో నని చుట్టుప్రక్కల తేరిపార చూశాను. ఆమె కారు కనబడలేదు. ఇలా పదినిమిషాలు గడిచిపోయినవి. ఆమెకోసం అలా నిరీక్షించ టం నాకు కొంత ఆందోళన కలిగించింది. విపరీతమైన ఆలోచనలతో శూన్యంలోకి చూశాను. ఆకుల చప్పుడు వినపడింది. శ్రద్ధగా ఇంకొకసారి చూశాను. ఇంకా దగ్గి రగా చెట్లకొమ్మలు కదిలిన చప్పుడు విన పడింది. ఒక పెద్దధ్వని, ఆధ్వని వచ్చినచోట నిప్పురవ్వలు కనపడ్డవి. అటు వైపు చూస్తుండగానే, తుపాకి గుండు నాగుండెల ప్రక్కకి దూసుకు వచ్చింది! తుపాకితో నన్ను ఎవరో కాల్చారని గ్రహించాను. నేను ఆమెను హత్యచేయటానికి వెళ్ళాను. ఆమె నాకంటే ముందుగానే ఎదురు దెబ్బ తీసింది! ఇద్దరి హృదయాలలో వున్న భావాలు మాలో ఎవరిమటుకు వాళ్ళకి మాత్రమే తెలు సును కాని, ప్రపంచానికి మాత్రం తెలి యదు. గుండుదెబ్బ తగలగానే, కారు సీటు లోనే వాలిపోయాను! పరిగెత్తుతూన్న అడు గుల చప్పుడు వినపడింది. ఒళ్ళంతా చెమ టలుపట్టినై. అప్పటికి నాకు స్పృహ తప్ప లేదు. కారు తలుపు తెరిచాను. ఎల్లాగైనా శ్రమపడి కారులోనుంచి బయటికి రావాలని ప్రయత్నించాను. అది దొంగతనంగా తీసు కొనివచ్చిన ఇతరుల కారు. దానిని నేను నడుపుతూవుండగా ఈ ప్రమాదం తటస్థిం చింది. నేను కారులోవుండటం ఇంకా అనేక ప్రమాదాలకు కారణమౌతుంది. నేల మీద కాళ్ళు నిలపలేక పోయినాను. నా గుండెపక్కగా చిక్కుకుంది తుపాకి గుండు. కూర్చోలేకపోయాను. నిటారుగా నడవటం కష్టమైంది. అలాగే కుంటుకుంటూ చాలా బాధతో వెళ్ళికొద్ది నిమిషాలసేపటికి నా కారు చేరాను. ఎక్కి కూచున్నాను. కారు “స్విచ్ కీ” ని జేబులు తడుముకుని బయటికి తీసి స్విచ్‌లో పెట్టాను. తర్వాత నాకు స్పృహ తప్పిపోయింది. కారు సీటులోనే పడిపోయాను. తర్వాత ఏమి జరిగిందో నాకు తెలియదు.

—ఇంకా వుంది.

## ★ శ్రీమతికి చీర కొనాలి ★

(19-వ పేజీ తరువాయి)

ష్యులు, ఖరీదైన కార్లలో వచ్చి, ఖరీదైన యీషాపు బట్టలు కొంటారనుకుంటా... లేకపోతే సామాన్యులు సాహసించలేని యీషాపెలా నిలబడింద... ధనవంతుల దర్జాలకు ఆ బట్టలన్నీ అవసరమే... రబ్బరుబొమ్మల కెంత అలంకారము చేశారు... పైగా వళ్లిన వారి కెంతో మర్యాద చేస్తారట... కాఫీ యిస్తారట...యివ్వరూ, ఆ మాత్రము కాఫీ ఎరచూపి మరి ఎంత లాభము తీస్తారో... యింతలో మరొక కారొచ్చింది...వాళ్ళూ ధనవంతులే... కాదు కాదు. ఆ కారులో దిగుతున్న అమ్మాయే మెడిసిన్ చదువుతోందని మా స్నేహితుడు చెప్పినట్లుగా జ్ఞాపకం యం. బి. చదువుతున్న అమ్మాయి ఎంతైనా ఖరీదు చీరలు కటగలదు... వాళ్ళూ ధనవంతులే... కాబట్టే యీ షాపులోనికి వెళ్తున్నారు... ఇంతకీ యీ షాపులో ఏ వస్తువా మా స్నేహితు లెవ్వరూ కొనినట్లు, చెప్పినట్లు జ్ఞాపకము లేదే... అంటే వాళ్లుగూడ నాలాగే భయపడిపోయివుంటారు... అంతే అయివుండాలి." అని అనుకొని నడుస్తూవుండగా "ఏమిరా, యిలా తిరుగుతున్నావు, యింతకీ నీవు వచ్చిన పని ఏమైంది?" అని నా చిన్ననాటి మిత్రుడు సుందరరావు నన్ను ప్రశ్నించేసరికి "ఆ, ఏముందిలే, మనకు ఎప్పుడు నసీబువుంటే అప్పుడే వస్తుంది ఉద్యోగం." అని ముక్తసరిగా జవాబుచెప్పాను. "ఆ అలాగా. అయితే, యీ రోడ్డెంగుడ సర్వేచేస్తున్నావురా" అని అడగగానే "చీర కొందామని వచ్చానురా...ఎక్కడా బేరముకుదర లేదు... కుదిరినా రకము నచ్చలేదు" స్టోర్సుకు పోదాం, పదరా, సరసమైన ధరలని తీసుకుపోయాడు. ఇద్దరమూ మాకున్న బట్టల జ్ఞానముతో ఎగాదిగా కదిపిచూసి, వాళ్ళు చెప్పిన బట్టల భాషను అర్థముచేసుకొని, షాపువాని నమ్మకముమీద నాకు నాజూగ్గా కనిపించే చీర ఒకటి తీసుకున్నా. పనిచూసుకొని పట్టణమునుంచి బయలుదేరి యిల్లుచేరుకున్నా. ఆయాసమంతా తీర్చుకొని, అవసరమైన కాలకృత్యాలన్నీ ముగించి, భోజనందగ్గర కూర్చునేసరికి, మా శ్రీమతి సందర్భానుసారంగా, తన ప్రశ్నలు, తనకు నచ్చిన సమాధానం రావాలని అనేకం వేసింది. కాని అమాంతంగా ఒక్కసారి నా ప్రజ్ఞ చూపెట్టుదామన్న ధోరణిలో చమత్కారముగా నేనూ నెట్టుకువచ్చినాను. ఇంతలో భోజనం పూర్తయిపోయింది. సంచిలోవున్న, షాపువాడి కవరు బయటికితీసి చూపించాను. మా ఆవిడ మరీ ఆత్రుతపడింది. ఆ ఆత్రుతలో నా చేతికవరు తానే స్వయంగా లాక్కొని తానే చింపి, ఎగాదిగా చూసి...ఒక్క నిట్టూర్పు వదులుతూ "ఇంతేనా...ఇదా దొరికింది మీకు అంతపెద్ద పట్టణములో...యీ రంగేమిటి యీ అంచు యిలా వుందేం...యింతకూ యీ రంగు ఉతుకుకు నిలుస్తుందా...ఛీ ఛీ ఆ రంగు నాకక్కరలే...మీరే పెటిలో పెట్టుకు దాచండి...కాశీవెళ్లి గాడిదను తెచ్చినట్లు, అంత పెద్ద పటణముపోయి, యీ చీరా తేవడము... సరిగదా చీర ఊసే నేనెత్తలేదుగా... మంచి జాకెట్టుగుడ్డలేమైనా తెమ్మన్నాను"... అని నా చీరల సెలక్షన్‌మీద లెక్చరుకొట్టేసరికి "నేనెందుకు కొన్నాను దేవుడా యీ చీర, మా శ్రీమతి చెప్పినట్లు ఆ జాకెట్టుగుడ్డలేవో కొని తెస్తే, యీ లెక్చరంతా లేకపోయి వుండు నని నా అతితెలివికి, అమాయకత్వానికి నేనే సిగ్గుపడి ఊరుకున్నాను. మరి మా యిద్దరిమధ్య ఉద్యోగాన్వేషణా ఫలితం గురించి, రాత్రివరకు చర్చయే రాలేదు. ★

# వనితాలోకం

## నెలకు రూపాయి ఆదాచేస్తే-

దేశంలోని సహజసంపదలను అభివృద్ధి చేసి, సమస్యలను పరిష్కరించి, సర్వతోముఖమైన జాతీయాభివృద్ధిని సాధించడమే పంచవర్ష ప్రణాళిక ఆశయం.

సంపాదించకుండా ఇతరులమీద ఆధారపడేవాళ్ళు మనదేశంలో నూటికి 60 మంది ఉన్నారు. వీరిలో పెక్కుమంది స్త్రీలు, పిల్లలు. ఇది పల్లె ప్రాంతాలలోకన్న పట్టణ ప్రాంతాలలో ఎక్కువగా కన్పిస్తుంది.

ఇతరులమీద ఆధారపడి నివసించేవాళ్ళు సంఘములో ఎప్పుడూ ఉంటూనే ఉంటారు. కాని వాళ్లు ఎంత తక్కువగా ఉంటే సంఘమునకు అంతమంచిది. ఈవిషయాన్ని దృష్టిలో పెట్టుకొని రెండవ పంచవర్ష ప్రణాళికలో స్త్రీలయొక్క పాత్రగురించి తెలుసుకొందాం. రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభించి సరిగ్గా ఒక సంవత్సరమైనది. దీనిని అమలు పరచటానికి నాలుగువేల ఎనిమిది వందలకోట్ల రూపాయలు కావాలని ప్లానింగు కమిషనువారు నిర్ణయించారు. దానిలో 400 కోట్ల రూ. పొదుపు ఉద్యమాల ద్వారా సాధించాలని వారు ఆశిస్తున్నారు. అంటే ఏడాదికి 80 కోట్ల రూ. కావాలన్నమాట.

మనదేశములో 17 కోట్ల మంది స్త్రీలు ఉన్నారు. దానిలో చిన్నవారు, మధ్యవయసు కలవారు కలిసి 9 కోట్లు. మన సంఘములో పురుషుడు సంపాదించటము స్త్రీ ఖర్చు పెట్టటము పరిపాటి. స్త్రీ సాధారణముగా విలాస వస్తువులకు డబ్బు ఖర్చు పెట్టటము మనందరికి తెలిసిన విషయమే. ఈ ఖర్చును తగ్గించి ప్రతిస్త్రీ నెలకు ఒక్క రూపాయి పొదుపుచేసినచో—అదేమంత కష్టమయిన పనికాదు. సంవత్సరమునకు దేశానికి 108 కోట్ల రూ. పెట్టుబడి వచ్చును. మనకు కావలసింది 80 కోట్లు రూ. కాబట్టి ఎంత సులభమో గ్రహించండి. ఈఆశయ సిద్ధికోసమే విద్యావంతులైన స్త్రీలు పొదుపు ఉద్యమాన్ని నిర్మాణంచేసి ప్రచారములోనికి తీసుకొనిరావాలి. స్త్రీలు తమ ఉద్యమాలను పట్టణములలో కేంద్రీకరించి పల్లె ప్రాంత్రములను అలక్ష్యము చేస్తున్నారు. ఈ పొదుపు ఉద్యమము జయప్రదము కావాలంటే దానిని పల్లెలలో ప్రారంభించి విస్తృతం చేయాలి.

## మన రాష్ట్రం

మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము 175 కోట్ల రూ. మేరకు ప్రణాళికలను తయారుచేసింది. దీనిలో వ్యవసాయానికి విద్యుచ్ఛక్తికి మొదటిస్థాన మిచ్చినారు.

తరువాత పరిశ్రమలు, విద్య, ప్రజారోగ్యము. దీనిలో సాంఘిక సంక్షేమానికి కేటాయించిన సొమ్ము అవసరమైన దానికన్న చాల తక్కువగా నున్నది. ఈ లోటుని పూర్తిచేయాలంటె ప్రాంతీయ ప్రజలు అన్ని విధాల సహకరించాలి. ముఖ్యముగా సాముదాయక అభివృద్ధి కేంద్రాలలోను, జాతీయ విస్తరణ సేవా కేంద్రాలలోను స్త్రీలకుప్రముఖమైన పాత్రయున్నది.

సాముదాయక అభివృద్ధి పథకాల క్రింద స్త్రీలు సేవచేయటానికి చాల అవకాశాలు ఉన్నవి. విద్యావంతులైన స్త్రీలు, పల్లెలలో ప్రతి ఇంటికి పోయి వారికి సంఘముయొక్క సమిష్టి క్షేమానికి వీరికాలాన్ని కొంత వినియోగించి పనిచేయాలని నచ్చ చెప్పాలి. ఒక స్త్రీ విద్యావంతురాలైనచో ఆమె తన కుటుంబములో వారందరినీ విద్యావంతులుగా చేయకలదు. కాబట్టి స్త్రీని విద్యావంతురాలిగా చేయటము అతిముఖ్యమైనది, అత్యవసరమైనది.

## విద్యావ్యాప్తి

అక్షరాస్యత మనదేశములో తక్కువ. స్త్రీలలో చాల తక్కువ. వయోజన విద్యా ఉద్యమము జయప్రదము కావాలంటె ముఖ్యముగా స్త్రీలలో నిరక్షరాస్యత పూర్తిగ నిర్మూలించాలి. మగవారు ఈకేంద్రములలో పనిచేయుచున్నచో స్త్రీలు విద్యనభ్యసించుటకు సిగ్గుపడుదురు. కనుక విద్యావంతులైన స్త్రీలు ఈ కేంద్రములలో పనిచేసి తోటి స్త్రీలకు సహాయపడవలెను.

రెండవ ప్రణాళిక కాలములో మన రాష్ట్రములో వైద్య, ప్రజారోగ్య సదుపాయములను విస్తృతము చేయుటకు మనరాష్ట్రములో కుష్ఠు నివారణ కేంద్రములు, మాతాశిశు సంరక్షణా కేంద్రములు, క్షయ నివారణ కేంద్రములు ప్రారంభము కానున్నవి. వీటన్నిటియందును పనిచేయుటకు స్త్రీలు ఇతోధికముగా ముందుకు రావలెను. మన సంఘములో పురుషుడొక్కడే సంపాదించుట ఆచారముగా నున్నది.

## కుటీర పరిశ్రమలు

స్త్రీలు తమ దృక్పథమును మార్చుకొని కుటుంబపోషణలో తమకుకూడా బాధ్యతకలదని గ్రహించినచో మనదేశముయొక్క ఆర్థిక స్థితి చాల వరకు అభివృద్ధి చెందును. స్త్రీలు తీరిక సమయములలో కుట్టుట, అల్లుట, వడకుట, మొదలైన పనులెన్నో చేయవచ్చును. దీనివలన కుటుంబ ఆదాయము వృద్ధియగును. అడుగంటిన కుటీర పరిశ్రమలు తిరిగి అభివృద్ధగును. స్త్రీలు కుటీర పరిశ్రమలలో తయారైన వస్తువులను ఉపయోగించినచో అది నిరుద్యోగ నిర్మూలనమునకు చాలతోడ్పడును. కాయగూరలు కాయించుటలోను, కోళ్లను పెంచుటలోను, పాడి అభివృద్ధి చేయుటలోను స్త్రీలు యెంతైనా సహాయపడవచ్చు.

ప్రజాసామ్యములో సాంఘికముగా కాని ఆర్థికముగా కాని అభివృద్ధి సాధించాలంటె సహకారము చాల ముఖ్యము. సహకార

# వేసవిలో పిల్లల సంరక్షణ

కొన్నాళ్ళకిందట వేసంగుల్లో జరిగిన సంఘటన ఒకటి చెప్తాను. మా బంధువులపిల్లాడొకడు, సంవత్సరం వుంటుంది. ఒకరోజు సొమ్మసిల్లినట్టు పడుక్కొని ఉండిపోయాడు. ఇంట్లో అంతా కంగారుపడ్డారు. అప్పుడొక అనుభవజ్ఞురాలు ఆ పిల్లవాడి నోట్లో నీళ్ళుపోసి, వళ్ళంతా తడిగుడ్డతో తుడిచి మెల్లిగా విసనకఱ్ఱతో విసిరితే ఆ అబ్బాయి తేరుకున్నాడు. ఆవిడ "పిల్లలు దాహం వేసినా అడగలేరుగదా. మనం కనిపెట్టి నీళ్ళు అస్తమానం ఇస్తుండాలి." అని హెచ్చరించింది.

## పళ్ళరసం

సంవత్సరంలోపు పిల్లలకి, పొద్దున్నే నీళ్ళుకాచి చల్లార్చి ఉంచుకోవాలి. అవి రెండేసి చెంచాలచొప్పున అప్పుడప్పుడు పట్టడం మంచిది. మరి 6 నెలలోపు పిల్లలైతే బార్లీ పల్చగా కాచి కొంచెం చక్కెరగాని గ్లూకోజుగాని కలిపి పడితే మంచిది. వేసవిలో కొందరికి తల్లిదగ్గర పాలుచాలవు. అప్పుడు పల్చగా పాలుకలిపి అలవాటు చెయ్యాలి. అన్నిటికం టెముఖ్యం పళ్ళరసం. టొమెటో, దానిమ్మ, బత్తాయి వీటిల్లో ఏదైనాసరే రసంతీసి పిల్లలకి మధ్యాహ్నం వేళ పట్టాలి.

సంవత్సరం దాటినపిల్లలకి సగ్గుజావపట్టండి, సగ్గుబియ్యం దోరగావేయించి పిండిచేసుకోవాలి. ఇంట్లో కాఫీపొడిమిషనుంటే దాంతో విసురుకోడం తేలిక. ఈ పిండి సుమారు రెండు టీస్పూన్లు ఒకకప్పు నీళ్ళుపోసి జావకాచి మజ్జిగగాని, పాలుగాని పోసియ్యాలి. నాఉద్దేశం పాలకంటే మజ్జిగ ఉప్పుకలిపి స్తేనే మంచిది. కాని కొందరు పిల్లలు పాలతోగాని తాగరు.

## దుస్తులు

పిల్లలకి వేసవిలో బట్టలు పల్చగా ఉండాలని వేరే చెప్పనక్కర్లేదు. నీళ్ళుపొయ్యగానే తుడిచి శుభ్రంగా వళ్ళంతా పౌడరురాసి తర్వాత బట్టలుతొడిగితే బాగుంటుంది. తలకి నూనెమాత్రం తక్కువగా రాయండం మేం! వంటికి చమటవల్ల పేలే (చమటకాయలని కొందరంటారు) కనకవస్తే వాటిమీద బాగా పౌడరు దిట్టంగాపట్టిస్తేసరి, పిల్లలకని ప్రత్యేకంగా పౌడరుఅమ్ముతుంది బజార్లో. సాయంత్రం తడిగుడ్డతో తుడిచి మళ్లీ పౌడరు రాస్తే మంచిది. చౌకబారు పౌడరుమాత్రం కొనకండి. అందులో సీమసున్నం పొడిఅంతా కలుపుతారు. అది మంచిదికాదు.

## నీళ్ళపోత

ఇంకపిల్లల నీళ్ళ విషయం. బజార్లో కస్తూరి పసుపుఅని అమ్ముతుంది. ఇవి మామూలు పసుపుకొమ్ముల్లాకాక కొంచెం తెల్లగా ఉంటాయి. ఈపసుపుకొమ్ములు సువాసనగా ఉంటాయి. ఇవి అణాకో, బేడకో కొని నలుగుపిండితో కలిపి మిషన్లో ఆడించుకోవాలి. లేకపోతే కస్తూరి పసుపు మనం దంపుకుని నలుగుపిండిలో కలుపుకున్నా బాధలేదు. ఇది నలుగురుకీ వళ్ళుతోమడానికి పనికొస్తుంది. ఈ పిండి వాడ్డంవల్ల పిల్లలకు సువాసనగా ఉండడమే గాకుండా కురుపులు మొదలైనవాటినుండి కాపాడుతుంది.

సాధారణంగా వేసంగిలో సెగ్గడ్డలు, కురుపులు పిల్లలకివస్తాయి ఇవి వేడిచేస్తే వస్తాయంటారు చాలామంది. గంజితో తలరుద్దితే చలవచేసి కురుపులురావు. కనుక గంజి, శీకాయికలిపి పిల్లలకి తలరుద్దితే చాలా మంచిది. ఇంక ఈ శీకాయిలో ఎండిన

**పంతుల సౌభాగ్యలక్ష్మి**
(విజయనగరం)

# నెలకు రూపాయి ఆదా చేస్తే...

సంఘాలకు ప్రాతిపదిక, పరస్పర సహాయము కాబట్టి స్త్రీలు తమకు కావలసిన సరకుల నన్నిటిని ఈసంఘములచే నడుపబడుచున్నటువంటి దుకాణములనుండి తెప్పించుకొనవలెను.

మన దేశములో జనాభా పెరుగుదల చాల ప్రమాదకరముగా నున్నది. జనాభా ఇదే విధముగా పెరుగుచున్నచో రెండవ ప్రణాళిక పూర్తి యగునప్పటికి 41 కోట్లమంది వుండగలరు. అట్టిచో ప్రణాళికయొక్క ఆశయములు నెరవేరవు. దంపతులందరు ఎంతమంది పిల్లలను పోషించగలరో అంతమందియే యుండునట్లు చూచుకోవాలి. పిల్లలుపుట్టుట దైవనిర్ణీతమనే మూఢ విశ్వాసాన్ని తొలగించుకోవాలి. ప్రభుత్వము కుటుంబ నియంత్రణ కేంద్రములను ప్రారంభిస్తున్నది. స్త్రీలు ఈకేంద్రములలోని వైద్యులను సంప్రతించి అవసరమగు సహాయమును పొందవలెను.

ప్రతి కుటుంబములోని స్త్రీ ఈ పంచవర్ష ప్రణాళిక తన కుటుంబప్రణాళికగా భావించి ప్రణాళికా విజయమునకు తోడ్పడవలెను. ప్రణాళిక విజయమే ప్రజాభ్యుదయము.

కె. అన్నపూర్ణా రామారావు.

* * *



చీర అంచుకి డిజైన్—దేవరపల్లి బుజ్జమ్మ (ఆలూరు)

**లోకో భిన్నరుచిః**

# కొందరికి పచ్చిబియ్యం, చెక్కపొడుం రుచి

ఒకరోజు మా అమ్మ ఎవరికో జబ్బుగా ఉందని చూట్టానికి వెళ్లింది. అమ్మ రాగానే ఆమెకి ఏమి జబ్బని అడిగాను. ఆమెకి ఒక దురలవాటు ఉందట. పచ్చి బియ్యం చూస్తేచాలు గుప్పిళ్ళకొద్దీ తింటుందట. పచ్చిబియ్యము తింటే ఏమవుతుంది చెప్పండి! అరక్క అజీర్ణము, విరోచనాలు. అంతర్వత్నిగా ఉన్నపుడు ఈ విషయము వేరే చెప్పక్కర్లేదు. ఈ అలవాటు మానుకోమని డాక్టరు ఎంత చెప్పినా మానుకోలేక పోతోంది.

'పుట్టుకతో పుట్టినబుద్ధి పుడకలతో పోవలసిందే' అని ఏదో సామెత చెప్పినట్టు ఏదైనా అలవడితే దాన్ని మానుకోవటం యెంత కష్టమో చెప్పలేము.

నేను చదువుకునే రోజుల్లో మా క్లాసులో ఒక అమ్మాయి వుండేది. పాపం! ఆ అమ్మాయికి సుద్ద, జొగ్గుముక్కలంటే మహా ఇష్టం. బొగ్గు, సుద్ద ఆమె దగ్గర ఎప్పుడూ స్టాకుండేది. ఇవి తినటంమూలంగా ఆమె పండ్లు, నాలుక నలగా గారపట్టినట్టుండేది. మాట్లాడేటప్పుడు చెయ్యో, కొంగో నోటికి కడ్డుపెట్టుకుని మాట్లాడేది. శ్రీమంతుల అమ్మాయే. అందంగా తెల్లగా వుండేది. ఏమిటమ్మా! నీకీ పాడలవాటు అంటే, 'నీకెందుకు నా యిష్టం' అని గసిరేది. ఎవరేమిచెప్పినా లాభం లేకపోయింది.

## నమ్మినా మానినా సరే...

మామూలుగా ఈ రోజులలో కాఫీలు, టీలు, తాంబూలం సేవించడం నాగరికతగా భావిస్తారు కొందరు. గొప్పగా చెప్పుకుంటారు కూడ.

ఆ మధ్య మా యింటికో ఆవిడ వచ్చింది. తననిగూర్చి గొప్పగా చెప్తూ, "అరగంటకొకసారి అరకప్పు కాఫీ లేకపోతే నేనుండలేను బాబోయ్" అంది.


కుమారి సి. రాధ

(హైద్రాబాదు)


ఇటువంటి అలవాట్లు కొన్ని మెరుగే. కొన్ని పై అలవాట్లున్నాయి చూశారా, అవి చూసేందుకు అసహ్యముగా మోటుగా వుంటాయి.

మా పిన్ని ఒకావిడకి, బియ్యంలో వుంటాయే, ఆ మట్టిరాళ్లంటే మహాయిష్టము. ఎప్పుడయినా మా ఇంటికి వచ్చినపుడు, 'మీ కిష్టమైన ఫలహారం ఇదిగో' అంటే నవ్వేసి ఊరుకునేది.

చేతిలో పానీదాన లేకుండా కదలని వారున్నారు. అడుగడుక్కి తమలపాకులు నమలుతుండటము, చుట్టలు తింటం కొందరికి అలవాటు. ఈ అలవాట్లు మన స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తుంటాయి. అలవర్చుకోవడం సులభమేగాని దాన్ని వదుల్చుకోవటంలోనే వుంది కష్టమంతా. మా స్నేహితురాలు ఒకామె పరీక్షప్పుడు నిద్ర రాకుండా వుండేందుకు టీ త్రాగేది. అది కొన్నాళ్లకలవాటై కూచుంది. రాత్రిపూట ఏదో వేడి పానీయము త్రాగందే నిద్రపోలేక పోతోంది.

ఏదైన జబ్బుచేసి డాక్టరు కాఫీ, టీ మానమనమని చెప్పితే నాల్గు రోజుల్లో కాఫీ మానటం బ్రహ్మప్రళయం అవుతుంది కొందరికి. మందైనా మానేస్తా మంటారుగాని కాఫీ మానని మహానుభావులున్నారు.

మాకు తెలిసిన ఒకావిడకి చెక్కలు తింటం అలవాటు. ఎన్ని చెక్కలు తినేదో చెప్పలేము. ఎక్కడలేని డబ్బు దానికే తగలేసేది. ఒకరోజు మాయింటికి వచ్చి "ఎంత ప్రయత్నించినా మానుకోలేకపోతున్నా ఏదైన ఉపాయం ఉంటే చెబుదూ?" అంది. గోధుమపిండిలో కొంచెం బియ్యం పిండి, చక్కెర లేక ఉప్పు వేసి ముద్దగా పిసికి, చెక్కలమాదిరిగా చేసి, నూనెలో వేయించిన గట్టిగా కరకరలాడుతూ ఉంటాయి. అవి చేసుకుని ఒక సీసాలో పోసుకుని చెక్కలకు బదులు నములుతుండమని సలహా ఇచ్చాను. ఆవిడలాగే చేసింది. ఆ అలవాటు పూర్తిగా తగ్గకపోయినా కొంత గుణం కనిపించిందిట.

కాఫీ, టీ మానుకోవలసివచ్చినప్పుడు మొదట రెండు రోజులు కొంచెం కష్టముగా తోచినను క్రమముగా అలవాటైపోతుంది.

## లోకో భిన్నరుచిః లేక మనిషికో బడాయి

మా అక్కయ్య ఒకావిడకి కాఫీలో పాలు లేకుండా డికాక్షను త్రాగటం అలవాటు. మళ్ళీ 'టీ'లో పాలుపోసుకుని త్రాగుతుంది. 'ఇదేమిటమ్మ చోద్యము' అంటె 'నాకు చిన్నప్పటినుంచి అలవాటు' అంటుంది. 'లోకోభిన్నరుచిః' అని అందుకే అన్నారు.

అలవాట్లనేవి మితముగా ఉంటే పర్వాలేదు. అతిగా ఉంటేనే వచ్చేది చిక్కంతా. మితిమీరిన దురలవాట్లవలన జబ్బుచేయుటం, డాక్టరు బిల్లులు చెల్లించటం జరుగుతుంది.

నేను ఇదంతా కల్పించి వ్రాశాననుకునేరు. చెవితో విన్నది కాక, కంటితో చూసింది వ్రాశాను. మన స్త్రీలలోనే ఇటువంటి దురలవాట్లు ఎక్కువగా ఉన్నాయంటే, స్త్రీలెంతగా అలవాట్లకి బానిసలవుతున్నారో విశదమౌతోంది. జిహ్వాని చంపలేక మితిగా ఉంటే, అలవాట్లకి దాసోహం అనవక్కరలేదు.

అలవాటనేది ఒక్కసారిగా మానుకోవటం కష్టం. దాన్ని కొద్దికొద్దిగా తగ్గించుకుంటూవస్తే క్రమముగాతగ్గిపోవచ్చు. అతిగా ఉంటే అన్నీ అనర్థాలే. కాబట్టి జాగ్రత్తగా ఉంటం మంచిది. ★

## వేసవిలో పిల్లల సంరక్షణ

నిమ్మడిప్పలుగాని, నారింజ, బత్తాయి, కమలాతొక్కలుగాని కలిపి వినియోగిస్తుంటే వంటికి చాలామంచిది. రసం పిండివేసిన నిమ్మడిప్పలు, ఒలిచేసిన నారింజ మొదలైనవాటి తొక్కలు వృథాగా పారెయ్యకుండా ఎండపెట్టి ఇలా ఉపయోగించడం మంచిది.

### మరికొన్ని విషయాలు

పిల్లలకి ఐస్ ఫ్రూట్ ఎక్కువగా ఇవ్వడం మంచిది కాదని నా ఉద్దేశం. అవి వంటికి వేడి చేస్తాయంటారు కొందరు. అంతేకాకుండా పళ్ళకి అట్టే మంచిది కాదని నా నమ్మకం.

నే చెప్పినవన్నీ చెయ్యడానికి వీలుండచ్చు, ఉండకపోవచ్చు. కాని చిన్న పిల్లలకి బార్లీ, కొంచెం పెద్దపిల్లలకి కాచి చల్లార్చిన నీరుమాత్రం మర్చిపోకండి. ఇంకోవిషయం ఏమిటంటే ఇంకా పెద్దపిల్లలకి మధ్యాహ్నం మజ్జిగఅన్నం పెడితే మంచిది. ★

# ఇరుగూ-పొరుగూ


## బి. యస్. లక్ష్మి

కాకినాడ


పూర్వం మనవాళ్ళు సాధారణంగా ఉన్న వూరు కదిలేవారుకాదు. ఇంతంత చదువులు వుండేవికావు. అందుచేత వున్న వూళ్ళోనే ఉంటూ ఎవరివృత్తి వారు చూసుకుంటూ కాలం గడుపుతూండేవారు. అందుచేత కొత్తగా కాపురానికొచ్చిన పిల్లలకు ప్రతీదానికి ఇరుగు-పొరుగుమీద ఆధారపడాల్సి వచ్చేదికాదు. ఎందుచేతంటే అనుభవంగల అత్తచాటుకోడళ్ళు కనుక.

కాని ఇప్పుడు కాలం మారింది. ప్రతివాళ్లు కాస్తో కూస్తో చదువుకుంటున్నారు. వాళ్ళ వాళ్ళ చదువుకు తగ్గట్టుగా ఏదో వక ఉద్యోగమవటము పెళ్ళిచేసుకుని భార్యతో వంటరిగా కాపురము పెట్టడము జరుగుతూంది. కొన్నాళ్ళపాటైనా వాళ్ళతో వచ్చివుండేందుకు, పిల్లలతో సతమతమయ్యే తల్లికికాని అత్తగారికికాని కుదరడం అరుదుగదా?

అటువంటి సందర్భంలో గృహిణిగా అనుభవం తక్కువై సరిగ్గా వంటైనా వచ్చిరాని అమ్మాయికి ప్రతి విషయంలోనూ ఇరుగు—పొరుగుల తోడ్పాటు ఎంతేనా అవసరం.

ఇటువంటప్పుడు మనవాళ్లు చెప్పుకునే చిన్నకథ జ్ఞాపకమొస్తుంది. కొత్తగా కాపరానికొచ్చిన ఒక అమ్మాయి తోటకూర కెంత ఎసరుపెట్టాలని పొరుగావిడ నడిగిందట. తగిలినా మిగిలినా జానెడులోతు నీళ్లు పెట్టమందిట. అసలే తోటకూర నీళ్ళు; దానికి తోడు ఈ నీళ్ళు కలసి ఎంతసేపైనా వుడక్క చాలా అవస్త పడిందిట. చివర కొయిల్లాలే ఈ అమ్మాయికి తోటకూర పులుసేనా వండటము రాదని నవ్విందిట. ఈ అమ్మాయికి రాకేకదా ఆవిడ నడిగింది. తెలిస్తే చెప్పచ్చు లేకపోతే మానెయ్యచ్చు. అంతేకాని అల్లా ఎందుకు చెప్పాలి చెప్పండి.

అసలు ఇటువంటి రకాలికి వేరే పనుండదు. ఎదటివాళ్లని తమ వుపదేశాల్తో రెచ్చకొట్టి మళ్ళీ వాళ్ళు వుట్టి గయ్యాళివాళ్లని తామల్లా కాదనీ బుజాలెగరేస్తూంటారు. ఇటువంటి పొరుగుతో చాలా జాగ్రత్తగా వుండాలి.

కొంతమంది చల్లనితల్లులు కొత్తగా కాపరానికొచ్చింది చిన్నపిల్ల అని ఏ అవసరమొచ్చినా ఆదుకుంటూ కష్టాల్లో సుఖాల్లో తోడునీడగా వుంటూ ఎంతో ఆప్యాయత కనపరుస్తారు. కష్టాల్లో సుఖాల్లో తోడునీడగా వుంటమంటే వాళ్లే డబ్బంతా మనకు పెడతారని మనము తింటామని కాదు.. వాళ్ళ మాటల చల్లదనమటువంటిది. కొత్తగా పెళ్ళయి అనుభవం తక్కువై ఒంటరి కాపురము పెట్టిన దంపతులు కొత్తల్లో కుర్రతనం వల్ల కాస్తకు కూస్తకు చిన్న చిన్న కజ్జాలు పెట్టుకోవటము జరుగుతూంటుంది. అటువంటప్పుడు వాళ్ళ వుద్రేకాల్ని చల్లపరచే ఇల్లాలికీ వాళ్లని రెచ్చగొట్టి కాపురాల్లో కలతలుపెంచే ఇల్లాలికీ తేడాలేదూ.

నేను కొత్తగా కాపురాని కెళ్ళినరోజుల్లో

(41-వ పేజీ చూడండి)



రేడియో కవరుకు—ఇ. పుష్పనాథము (నంద్యాల)

# కథకాదు

## గుడివాడ సుశీల

పోతపోసిన బంగారుబొమ్మలా ఉండేది సీతమ్మ. అందానికితగ్గ వినయం వందనం ఉండేవి.

అయితేనేం ఆపిల్ల అత్తగారికంటికీ ఆడబడుచుకంటికీ, ఆఖరుకు చేసుకున్న భర్తకీకూడా కంటకప్రాయం అయిపోయింది.

సీతావాళ్లూ మాఎదురింట్లో కాపరం ఉండేవారు. అప్పటికి సీత కాపరానికి వచ్చిఏదోకొన్ని నెలలుఅయివుంటుంది. మా ఎదురింట్లోదిగి 15 రోజులయింది. రోజూవాళ్ళింట్లో ఏదో కజ్జా, గందరగోళం సాగుతున్నట్టే ఉండేది. ఒకరోజున సీత కుళాయిదగ్గరికి వచ్చింది నీళ్లకోసం.

ఏమిటమ్మా అలావున్నావు వంట్లో ఏమన్నా నలతగాఉందా అన్నాను. అబ్బే ఏంకాదండీ అనేసి తలవంచుకుని వెళిపోయింది. వంట్లో నలతకాదమ్మా ఇంట్లో కలతలే నీకుతెలీదూఅంది నాపక్కనేఉన్న సుబ్బలక్ష్మమ్మగారు.

సీతని భర్త సరిగ్గా చూడడట. మనిషి అందగాడు కాడు, నలుపు. స్ఫోటకంపడ్డ మూలాన మొహం కొంచెం భీకరంగాకూడా ఉంటుంది. దానికితగ్గట్టు ఎప్పుడు చిర్రుబుర్రు మంటూఉంటాడనీ, దగ్గరికి రానియ్యడనీ కూడా చెప్పింది ఆవిడ. దానికికారణం సీతేనని అత్తగారూ ఇంటిఆడపడుచూ ఆడిపోస్తున్నారట రాత్రింబవళ్ళు.

తరవాత నాలుగైదురోజులు అలాగే సీతనిచూసి పలకరిస్తూవచ్చాను.

ఏమన్నా ఎప్పుడూ అలా విచారంగా ఉంటావు. చిన్నపిల్లవిగదా నీకీదిగులు తగదుసుమా అమ్మడూఅని ఒకరోజున లాలిస్తూన్నట్టు మందలించాను.

సీత కంట తడిపెట్టుకుంది. ఈ విచారం నాతోటేపోవాలి లెండి పిన్నిగారూ ఈజన్మకింతే అంది మెల్లిగా.

పేగుసంబంధం ఏం లేకపోయినా నాకు మనస్సు చివుక్కుమంది పదహారేళ్లు దాటని పసిపిల్లనోట అలాటి మాట వినేసరికి. ఇంకోళ్ల ఇంటి గొడవలో కలగచేసుకోవడం తప్పే అయినా మనసు ఉండబట్టింది గాదు. అప్పుడే దీపాలు పెడుతున్నారు. సీత వాళ్ల అత్తగారువాళ్లూ గుడికి వెళ్లారు.

ఏమైనా సరేనని సీత వెంట వాళ్లింటికి వెళ్లాను సనువు తీసుకుని.

అమ్మడూ నాకు చెప్పకపోతే ఒట్టేసుమా అన్నాను.

సీతకి ఒక్కసారి ఏడుపు పెల్లుబికి వచ్చేసింది. మా నూకళ్ల బతుకుని మావాళ్లు మట్టిలో కలిపేశారు అని ఏడిచింది. సీతమాటలు నాకింకా జ్ఞాపకం ఉన్నాయి....

* * *

“మాది మేనరికం. ఆయన మా అమ్మకి స్వయానా తమ్ముడికొడుకు. పెళ్లి చిన్నప్పుడే చేశారు. మా నాన్నకి ఇష్టం లేదుట. అమ్మపట్టుదలే. నాకు తొమ్మిదేళ్లుంటాయి. దసరాపండగలకి ఆయన్ని మాయింటికి తీసుకొచ్చారు. నేను మా నేస్తాలూ అప్పుడు ఆడుకుంటున్నాం. ఏదో పేచీవచ్చి తగవు లాడుకుంటున్నాం. అప్పుడు వారు అక్కడే ఓకుర్చీలో కూచుని మా నాన్నతో మాటాడుతున్నారు.

“ఏమేపిల్లా ఇంత కోతిచేష్టల దానివి రేపు నీతో వేగడం చాలా కష్టమే అన్నారు. నేను ఊరుకోక, కోపం కొద్దీ, కోతివి నువ్వా నేనా నల్లగా పొట్టిగా పగలుచూస్తే రాత్రి కలలోకి వస్తావు మళ్లీ” అని అప్పటికి నోటికొచ్చినంతా అనేశాను. దాంతో ఆయనకి చాలాకోపంవచ్చి, భోజనం కూడా చెయకుండా వెంటనే బస్సుకి వెళ్ళిపోయారు. మా నాన్న, అమ్మ బతిమాలినా వినలేదు. అప్పట్నించి మళ్లా ఎప్పుడూ మాయింటికి రాలేదు. రెండేళ్ల తరవాత మా నాన్నగారు పోయారు...

నాకు పధ్నాలుగో ఏడు వచ్చింది. ఆయన అంతట ఆయన కాపరానికి తీసుకెళ్ళేలా లేరని, మా అమ్మమ్మ, తాతగారు, అమ్మ నన్ను వెంటబెట్టుకుని వారింటికి తీసుకెళ్లారు. తాతగారి బలవంతంమీద ఆయన ఒప్పుకున్నారు.

“కార్యంరోజు రాత్రి నేను గదిలోకివెళ్లగా ఆయన నన్ను గసిరి,తిట్టి,తరవాత కొట్టి బయటకు గెంటేశారు. మా అమ్మమ్మ వచ్చి ఏమిటే అలా పెంకితనం చేశావు. మావయ్యకి అసలే కోపం ఎక్కువ. జాగ్రత్త అనికోప్పడి మళ్లీ గదిలోకి పంపించింది. ఆయన మాట్లాడలేదు నేను చెంగు పరుచుకుని పడుకున్నాను. ఆ రోజునించి ఆయన నా మొహం కనబడితే చాలు చిరాకుపడి లేచి వెళిపోతున్నారు. మా అమ్మమ్మ, ఆడపడుచు, తోటికోడళ్లూ అందరూ, నేనే ఆయనని ఏదో అనరాని మాటలని కోపం తెప్పించానని రోజూ తిట్టుతున్నారు. ఇరుగుపొరుగులతో నామీద లేనిపోనివి కల్పించి చెప్తున్నారు.

ఒకరోజున మాయింటిగలావిడ నన్ను చాటుకిపిలిచి, తప్పులేమేనా ఉంటే క్షమించమని నీ మొగుడి కాళ్లమీద పడు అని చెప్పింది.

నేను ఏమైనా సరేనని తెగించి, ఆ రోజురాత్రి ఆయన కాళ్లమీద పడి నా తప్పేమిటో చెప్పమన్నాను. తప్పులుంటే క్షమించమన్నాను.

ఆయన కోపంగా నన్ను తన్నేసి నేను కోతినిగా నీకుతగనుగా అన్నారు. మొదట నాకు అర్థంకాలేదు. ఆయన ఇంకా సాధిస్తూ, ఆ రోజున మీ యింటికి వచ్చినపుడు మర్యాద చేశావుగా చాలులే అన్నారు. అపుడు జ్ఞాపకం వచ్చింది.

మావయ్యా తెలియక చిన్నప్పుడు అన్న మాటలు నువ్విలా పట్టించుకుని శిక్షించడం న్యాయమేనా, ఇప్పుడేనా క్షమించు మావయ్యా అని కాళ్లమీద పడ్డాను.

ఆయన మరింత కోపం తెచ్చుకుని, వళ్లుహూనం అయేలా కొట్టారునన్ను. అవతలికిపో అన్నారు. మళ్లీ ఈ సారి మొహం చూపిస్తే నిన్ను పొడిచి నన్ను పొడుచుకుంటాను అన్నారు. ఇదంతా చూస్తున్న మా అమ్మమ్మగాని తోటికోడలుగాని నన్ను పలకరించ నైనా పలకరించలేదు. చావలేక ఇలా బతికున్నాను.”

* * *

సీతకథ వినేసరికి కడుపు తరుక్కుపోయింది. ఏంచెప్పాలో ఎలా ఓదార్చాలో కూడా తెలియలేదు. అంతటి దుర్మార్గు లుంటారా అనిపించింది.

సీత కళ్లనీరు ఒత్తుకుని, పిన్నిగారూ ఈ మాటలు మీకడుపులో దాచుకోండి మళ్ళీ ఎక్కడా అనొద్దు. అంది. నేను నెమ్మదిగా లేచి ఇంటికి వెళ్లిపోయాను మాట్లాడకుండా.

ఇది జరిగిన వారంరోజులకి, వాళ్ళింట్లోంచి ఏడుపులూ పెడబొబ్బలూ వినబడ్డాయి.

ఏమిటా అని ఆత్రుతగా చూడబోయేసరికి, సీత రాత్రి నూతిలోపడి చనిపోయిందన్నారు. ★

ఉత్తరాలు:

# తెలుగు సినిమాలు

తెలుగు దేశంలో సినిమా హాలులు యెంత దరిద్రంగా వుండాలో అంత దరిద్రంగానూ వుంటాయి. సరియైన సీట్లు వుండవు. అంతకంటే ముఖ్యమయిన విషయం, టిక్కెట్లు. టిక్కెట్లు దొరకడం ఒక బ్రహ్మాండమయిన విషయం!

టిక్కెట్ల బుకింగ్ దగ్గర ఒక 'క్యూ' అన్నదేమీ వుండదు. మగాళ్లకి ఎక్కడైనా 'క్యూ' ఉంటుందేమో కానీ, ఆడవాళ్లకి మాత్రం అది వుండదు. ఏర్పాటు చేసేవారూ లేరు.

ఎక్కువగా, పావలా, తొమ్మిదణాల బుక్కింగులదగ్గర పెద్దయుద్ధం జరుగుతుంది! కొప్పులూడదీసుకుంటారు, గాజులు పగలగొట్టుకుంటారు. డబ్బులు పోగొట్టుకుంటారు. విలువయిన నగలుకూడా మాయం అవుతోవుంటాయి!

మ్యాటనీకి వచ్చినవాళ్లు ఎండలో మలమల మాడిపోవలసిందే కానీ... నీడలో నుంచుందామన్నా చోటు ఉండదు. అంత చక్కగా ఉంటాయి సినిమాహాలుల దగ్గర ఏర్పాట్లు.

తెలుగు చిత్రం విడుదల అయిన మొదటి రోజుని వర్ణించలేము. ఇసుకవేసినా రాలనంత జనంతో, కిటకిటలాడుతూ వుంటుంది సినిమాహాలు.

ఆవేళ, మొదటిఆటకే వెళ్ళిపోతారు చాలామంది ఆడవాళ్ళు. పోనీ, ఒంటరి వాళ్ళు ఎలాపోయినా యిబ్బందిలేదు. కానీ, పసిపిల్లలని నెలలపిల్లల్ని వెంటబెట్టుకొని రావడంలోనే ఉంది గమ్మత్తు.

సినిమాహాల్ లో టిక్కెట్ల సదుపాయం చెప్పానుకదూ! ఇక లోపటిసంగతి! భయం వేస్తుంది లోపల చేరుసుమాత్రం రెండు మూడు వరుసలలో బల్లలు వుంటాయి. ఇది 'నేల' సంగతి. పోనీ, తొమ్మిదణాలకీ, పద్నాలుగణాలకీ వెళితే-నల్లులబాధ అటుంచండి. ముందు 'మేకుల' బాధ భరించలేము.

నేలకి వెళ్లేవారిసంగతి చెప్పడమే కష్టం! ఒకరిమీద ఒకరు కూర్చుంటారు. ఎన్ని టిక్కెట్లు యిస్తాడో ఏమో, అదంతా హాలువారికే ఎరుక! పిల్లలకి పాలు యివ్వడానికయినా సందువుండదు!

ఈబాధ యిలావుంటే, మగవాళ్లబాధ! 'స్వర్గానికెళ్ళినా సవతిపోరు తప్పదు' అన్నట్టు, వీళ్లబాధ యిక్కడ విపరీతం!

వీళ్లు బెంచీలమీద నుంచొని, ఆడవాళ్ళ వైపు చూస్తూ ఆర్భాటం చేస్తూవుంటారు. సిగరెట్లు కాలుస్తూ, ఆపొగని యిటువైపుకి వదులుతూ వుంటారు. వీళ్ళని చూస్తూంటే నవ్వాలో, ఏడవాలో అర్థంగాదు! మ్యాటినీలకి వెళితే, ఊపిరి ఆడదు చుట్టా, బీడీ, సిగిరెట్ పొగలతో ఆడవాళ్లకంటే ఎక్కువగా, పిల్లలు ముందు ఉక్కిరిబిక్కిరి అయిపోతారు.

ఇటువంటి దొమ్మి వున్నప్పుడు, ఆడదొంగలు ఎక్కువగా వస్తూవుంటారు. సినిమాకి వెళ్ళేవాళ్లు చంటిపిల్లలని వెంటబెట్టుకు వెళ్ళడమేగాకుండా, ఉన్న నగలన్నీ పెట్టుకొని మరీవెళ్తారు. అవికాస్తా, టిక్కెట్లు పుచ్చుకున్నప్పుడో, సినిమా చూస్తున్నపుడో 'కృష్ణార్పితం' అయిపోతాయి!

ఆడవాళ్లు సినిమాలకి, ముఖ్యంగా యిటువంటి సినిమాహాళ్లకి వెళ్ళడం మానితేనేగానీ, హాలువారు తగిన సదుపాయాలు చెయ్యరు!

పోనీ, పసిపిల్లలతో మొదటిరోజు సినిమాలకు వెళ్లడం తగ్గించినా మంచిదే!

పి. పూర్ణిమ. (విజయవాడ.)

* * *

## అసలు కారణం

ఇప్పుడు కట్నాల బాధ ముఖ్యంగా ఎందుకెక్కువయిందంటే ఉన్నవారు, లేనివారు కూడ కట్నమిచ్చి డబ్బున్న వాళ్ల పిల్లల కోసం, వారికి విద్య లేకపోయినా కూడా, తాపత్రయపడటమే. ఇటువంటి విషయాలలో సంఘ దృష్టి మారితేనేగాని, సమస్య తీరదు. మన మూడవ పంచవర్ష ప్రణాళిక పూర్తయేటప్పటికి, సాంఘిక వ్యవస్థే మారిపోతుంది.

ఆ వ్యవస్థలో రైతుకి, జమీందారుకి, ఆర్థిక భేదము చాల తక్కువగా ఉంటుంది. ఇప్పటి మాదిరిగా ఇంటి దగ్గరనుంచి డబ్బు తెప్పించుకొంటూ, బస్తీలో కాపురం పెట్టి విచ్చలవిడిగా ఖర్చుపెట్టడానికి డబ్బుండదు. రాబోయే రోజులలో, ఒక కుటుంబం, సమంగా గడవాలంటే భార్యా, భర్త, ఇద్దరు కష్టపడి, ఉద్యోగం చేస్తేనేగాని కుటుంబం గడవడం కష్టం. అందువలన మన ఆడపిల్లలకు చదువుబాగా చెప్పించి, పెళ్లిళ్ళ కోసం తొందరపడి పాకులాడక, సంఘంలో ఉన్నత స్థానమేర్పరిస్తే రాబోయే రోజులలో వారికి పెళ్లిళ్లు కావడం అంతకష్టం కాదేమో!

చెరుకూరి లక్ష్మీకామేశ్వరి,
విజయవాడ.

* * *

## ఇటువంటివాళ్లు లేకేం?

మా అమ్మగారికి ఈ మధ్య రక్తపుపోటు వస్తే ఎట్లా నయమవుతుందా అని మేమంతా దిగులు పడేవాళ్లం. ఇరుగు పొరుగున వున్న అమ్మలక్కలు కొందరు చూడటానికి వచ్చి ధైర్యం చెప్పటంపోయి తలవొక మాట అని పోతూవుండేవారు. డాక్టరుగారు నీకు లేనిపోని ఆలోచన దిగులు చికాకు కూడదని చెప్పినా ఈ మాటలవల్ల ఎప్పుడు ఏదో దిగులుతో వుండేది. ఒక రోజున ఒకామె వచ్చి, (వెనక రోజులలో ఎప్పుడో ఆమె ఇంట్లో మేము అద్దెకున్నామట) మా అల్లుడికి కూడా అలాగే వచ్చింది, డాక్టర్లు ఏమో రక్తపుపోటు అని అన్నారు. ఆదేమో చివరకు పక్షవాతము క్రింద దింపింది. దీనివల్ల ఇంకా అనేక రోగాలు కూడా వస్తాయి" అని చెప్పిపోయింది. డాక్టరు మందువల్ల రోగము తగ్గుతున్నదీ అని మేము అనుకొంటే వీళ్ళ మాటలవల్ల బాధ మరింత అధికమయ్యేది.

యల్. రమాదేవి,
చిలకలూరిపేట.

* * *

## ఎంతలేదన్నా...

20-3-57 వ తేదీ ఆంధ్రపత్రిక వారపత్రికలో 'చుట్టాలువస్తున్నారు జాగ్రత్త' అన్న వ్యాసమును చదివాను.

ఎంతలేదన్నా ఇంటికివచ్చే చుట్టాలు అంత అసభ్యంగా, నిరుత్సాహమాటంగా ప్రవర్తించరు. అసలు పరాయివాళ్ళు ఇంటికి

వెళ్లినప్పుడు చాలామంది ఎంతో మొహమాటంగా సిగ్గుగా మర్యాదగానే వీలయినంత వరకూ ప్రవర్తిస్తారు.

పరాయివాళ్ళ యింటికివెళ్ళి అధికారాన్ని చెలాయించటంమాట అలావుంచి వారి స్త్రీల విషయాల్లోకూడా చనువుగా కలుగచేసుకొని వారిమీద భర్తలకు చాడీలు చెప్పే లాంటి చుట్టాలు నేడు ఏఒక్కరోగాని అసలు లేనేలేరు. బంధుబాధపడే గృహిణులు నేడు అంతగా లేరనే నా అభిప్రాయం.

ఎ. వి. రత్నం, (గూటాల.)

*   *   *

## మరికొందరు చుట్టాలతరహా

అల్లమరాజు సర్వమంగళగారు అన్నిరకాల చుట్టాల గురించి వ్రాసినారుకాని, కొందరిని గురించి మర్చిపోయారేమో. కట్టుబట్టలతో వస్తారు కొందరు. కొందరు రెండేబట్టలతో వస్తారు. వచ్చినప్పటినించి నాబట్టలు మాసిపోయాయమ్మ అని మనబట్టలు కట్టేస్తారు. ఇంక మనబట్టలు వారి ఒంటిమీద చిరుగులు పట్టాలిసిందేగాని • వాళ్ళుమాత్రం విడిచిపెట్టరు. కొందరుఅయితే సరేసరి. మనవి గడివిప్పనివి కొత్తబట్టలుకూడ కట్టేస్తారు. మాస్నేహితురాలింటికి ఒకఆవిడ వచ్చింది. ఆవిడకి తొమ్మండుగురు పిల్లలు. వాళ్ళు తల్లిమాటే వినరు. ఇంక ఇల్లంతా నానా హంగామా చేసిపెట్టారు. ఆ తల్లి, అమ్మాయి ఈ చంటిపిల్లాడికి పాలుపట్టమ్మ అనీ దానికి తలదువ్వమనీ దీనికి నీళ్ళు పొయ్యమనీ మా స్నేహితురాలికి పని చెప్పేటప్పటికి కాదనలేక చేసింది. ఫలితంగా వాళ్లువెళ్లినా వారంరోజులదాకాకూడ జ్వరంతగ్గలేదు.

కె. లలితకుమారి, (ఏలూరు.)

*   *   *

## చుట్టాలొచ్చారు

'చుట్టాలొస్తున్నారు జాగ్రత్త' చదివి నిజంగా అటువంటి చుట్టాలుంటారా అని నవ్వుకొంటుండగా నా స్నేహితురాలు సావిత్రి వచ్చి ఏమిటే ఒక్కర్తివీ కూచుని అలా నవ్వుకొంటున్నావని అడిగింది. చూడు నీకే తెలుస్తుంది అని పత్రిక దాని చేతికిచ్చేను. అదికూడా చదివి ఓస్ దీనికేనా అంతలా నవ్వుతున్నావు అంది. అని ఒక కథలా చెప్పింది చుట్టాల భోగట్టాన్ని. "ఆ మధ్య మా బంధువులింటికి ఒకావిడా ఆరుగురు పిల్లలూ వచ్చేరు. వస్తూనే బండివాడు సామాను ఇంట్లో పెడుతుంటే, అలా తోవలో పడేకోయ్ అలా ఆ గదిలో పెట్టు అన్నీ వారకి జాగ్రత్తగా పెట్టు"అని అందిట. సరేనని సామానంతా ఆగదిలో పెట్టి బాడుగ డబ్బులు ఇమ్మన్నాడుట, అయ్యో నాదగ్గిర చిల్లర లేదు పిన్నిగారూ మీ దగ్గర వుంటే అర్ధరూపాయి ఇద్దురూ అందిట. సరేనని ఆవిడ అర్ధరూపాయి ఇచ్చి అందరూ కులాసాగా వున్నారా మొదలయిన భోగట్టాలడుగుతుంటే...పిన్నిగారూ పొద్దున్న పదిగంటలకి అక్కడ రైలెక్కాము మధ్యాన్నం కాఫీ కొనుక్కుని తాగుదామంటే ఎక్కడా మంచిది దొరకలేదు. చాలా తలనొప్పిగా వుంది. గొంతుక ఎండిపోతుంది ముందర కొంచెం త్వరగా కాఫీ ఇద్దురూ అని అడిగింది. సరేనని కాఫీచేసి తల్లికి పిల్లలికి గ్లాసులలో పోస్తే పంచదార చాలలేదని ఓ పిల్లా, పాలు చాలవని ఓపిల్లా తలొకలా అంటుంటే ఆవిడ కూడా "కాఫీగుండ ఎక్కడ కొంటారో కానీ చాలా వాసనగా వుందండి అబ్బా" అందిట. మొత్తానికి కాఫీ గన్నె మాత్రం కాళీ చేసేసేరు. మర్నాడుపొద్దున్న ఇంటాయన కూరలకి వెళ్తుంటే బాబుగారూ మా రెండో అమ్మాయి చద్దిఅన్నం తినదు జొత్తిగా వంటయేవరకు వుండలేదు వచ్చేటప్పుడు రెండు ఇడ్లీ తెద్దురూ అని అడిగిందట. సరేనని అతను నాల్గు ఇడ్లీ కొనితెచ్చేసరికి పిల్లలందరూ నాకే కావాలంటే నాకే కావాలని వానరసైన్యంలాగ గంతడం మొదలుపెట్టేరుట. అటువంటి పిల్లల్ని తల్లి కోప్పడలేదు సరికదా "పోనీ లెండన్రా రేపు లావుగా (చాలా) తెస్తారు" అందిట.

"పిన్నిగారూ ఈమధ్య ఇల్లు కట్టుకున్నారని విన్నాను ఇల్లంతా చాలా బాగుంది. అది పడకగదా. ఇది సామానుగదా, వూరగాయకొమ్మోసు ఇందులో పెట్టుకుంటారు" అని లోపలికి వెళ్లి కుండలూ జాడీలుమీద మూతలు తీసిచూసి, "నిరుటి ఆవకాయ ఇంకా దాచేరా మీ అల్లుడుగార్కి ఆవకాయ అంటే పంచప్రాణాలు. కొంచెం సీసాలో పెట్టి ఇద్దురూ రుచిమూస్తారు" అందిట.

ఇక ఆ సాయంత్రం సినిమాకు రమ్మని బలవంతంచేసిందట. వెళ్లకపోతే బాగుండదని ఆవిడ వెళ్ళిందిట. హాలు గేటుదగ్గిర, "పిన్నిగారూ అట్టే జనం లేనట్టున్నారు తొమ్మిదణాల టిక్కెట్లే కొనండి చాలు" అందిట ఇక హాలులో పిల్లలు చేసిన అల్లరి ఇంతా అంతా కాదుట. జంతికలు కొనమని పకోడీలు కొనమని ఒకటేమిటి ఏమిటి అమ్మితే అవన్నీ కొనమని మారాం చేసేరుట. చివరికి వారు బయల్దేరినరోజున రైలు ఆరుగంటలకే అయినా, ఆగృహస్థు మూడు గంటలకే స్టేషనకి తీసుకెళ్ళిపోయి, తరవాత వాళ్లు ఎక్కిన రైలు ఊరి పొలిమేర దాటేదాకా స్టేషన్‌లోనే ఉండి మరీ వచ్చాడట."

—డి. అన్నపూర్ణ (విజయనగరం)

## వనితలకు వినతి

ఆంధ్రపత్రికలో స్త్రీలకొరకు ప్రత్యేకంగా "వనితాలోకం"శీర్షిక నిర్వహిస్తున్నారంటే మనమెంతో గర్వించతగ్గ విషయం. వనితాలోకాన్ని మన మహిళలంతా కలసి ఎంతో అభివృద్ధి చేసికోటం మనకే మేలని నా అభిప్రాయం. ఎంతోమంది సోదరీమణులు ఎన్నో విషయాలను గురించి వ్రాస్తున్నారు. మనకు తెలియని విషయాలెన్నో నేర్చుకుంటున్నామని నా మట్టుకు నా కనిపిస్తోంది. ఇంతకీ నే చెప్పేదేమంటే వనితాలోకంలో ఈ మధ్య "పెరిగినగి రాకీ" (హైద్రాబాద్) గురించి ఎన్నో తర్జనభర్జనలు జరిగి చివరికి ఒక సోదరి సలహాతో ఆగిపోయాయి. లేకుంటే ఆ విషయం యింకా ఎంతగానో విజృంభించి ఉండేదనిపిస్తోంది. వనితాలోకంలో అందరికీ పనికివచ్చే విషయాలు, క్రొత్తవి, పిల్లల ఆరోగ్యం, గౌరవ మర్యాదలగురించి ఇంకా ఎన్నో విషయాలను గురించి తోటిమహిళలు వ్రాస్తే చదివి ఆచరణలో పెట్టాలిగాని "అది సబబుకాదు." "ఇది న్యాయంకాదు" ఆవిడ చెప్పింది సరికాదు" అని ఒకరు వ్రాసిన విషయంపైన చర్చించుకుంటూ కూర్చుంటే వనితాలోకం నలుగురికీ పనికివచ్చే శీర్షిక కాకుండా వ్యర్థ వాదోపవాదాలగ్గాను ఏర్పరచినట్లవుతుంది.

ఎల్. వి. సరోజానాయుడు, చిత్తూరు.



## ఇరుగు - పొరుగు

(33-వ పేజీ తరువాయి)

సరిగ్గా ఇల్లానే జరిగిన సంగతి నాకు బాగా గుర్తు.

అవి నేను కొత్తగా కాపురానికొచ్చిన కొత్తరోజులు. దేనికో దానికి చిన్న కజ్జాలు పెట్టుకుండేవాళ్లం కాని, అవి బయటకు తెలియకుండా అంతలో సర్దుకుపోయేవి. ఒకసారి ఏదో పండగవచ్చింది. ఆయన చేతిలో డబ్బులేక నేను చీర తెమ్మన్నా తేలేదు. నాకు నిజంగా చాలా కోపమొచ్చింది. ఆరోజంతా ఎడమొగము పెడమొగము గానే తిరిగాము. ఆయన ఆఫీసుకెళ్ళిపోయారు. నేను ఆలోచిస్తూ అల్లాగే కూర్చున్నా.

ఇంతలో మాపొరుగు ఇల్లాలు (కూర ఎల్లావండాలమ్మా అని అడిగితే కూడా చెప్పని ఇల్లాలు) అల్లావున్నావేమమ్మా అంటూ ఆప్యాయంగా పలకరిస్తూ వచ్చి కూర్చుంది. కూర్చున్నావిడ వూరుకోకుండా మీఆయన పండక్కి ఏం చీర తెచ్చారమ్మా అని అడిగింది. నేను సమాధానం చెప్పలేదు. ఆవిడే చెప్పుకుంటూ పోయింది.

# ★ జొన్నగడ్డితో- ★

## ఫ్రూట్ జెల్లీ

ఎండా కాలం. రొట్టె, పూరి, దోశె వగైరాల్లో కలిపి తినడానికిది చాల బాగుంటుంది. యిది చేయడానికి, ఏ పండు వాసన యిష్టమైనవారు ఆ పండు రసం తీసిచేసుకోవచ్చును. అనగా - ఉసిరిక - టొమాటో - నిమ్మ, నారింజ-కమలా-బత్తాయి. కర్బూజా - జామ - అరటి కూడ ఉపయోగించవచ్చును. ఉసిరిక - నారింజ నిమ్మజాతులైతే ఉడికించి - పిసికి రసం తీసికోవాలి. తక్కిన మెత్తటిపండ్లు - వేడినీటిలో పిసికి రసం తీసికోవాలి. రసమంటే చిక్కని జావవలె ఉండాలిగాని పల్చగా నీరువలె ఉండకూడదు. దానికి కావలసిన ముఖ్యమైన వస్తువు జొన్నగడ్డి దానినే హల్వాగడ్డి అంటారు. యిది తెల్లగా గడ్డి పోచలవలె

**యమ్. సత్యబాలాదేవి**

ఉంటుంది. బజారులో దొరుకుతుంది. ఇదివరకు చాల తక్కువ ఖరీదు ఉండేది. యిప్పుడు తులం 0-6-0 వరకు పెరిగింది.

కావలసిన వస్తువులు - 1 కప్పు — పండు రసం, 3 కప్పులు-చక్కెర, 1 తులం-జొన్నగడ్డి, 1 కప్పు-నీళ్లు, చిటికెడు మిఠాయిరంగు. 10 బాదంపప్పులు.

జొన్నగడ్డి చిన్న ముక్కలుచేసి నీళ్ళలో వేసి-వెడల్పాటి కళాయి గిన్నెలో వేసి పొయ్యిమీద పెట్టాలి. గడ్డిముక్కలన్నీ కరిగిపోయాక పండురసం చక్కెర పోయాలి. గరిటెతో కలుపుతూ చిక్కగా ఉడికేటప్పుడు చేతితో తాకిచూడాలి. చిన్న తీగవలె పాకంసాగుతుంటే — యిష్టమైనరంగూ సన్నగా తరిగిన బాదం పప్పులు వేసి - చల్లని చోట కదపకుండా పెట్టి చల్లారనివ్వాలి. పూర్తిగా చల్లారిన తరువాత మరి 2 గంటలు కదలకుండా ఉంచితే గట్టిబడుతుంది. అప్పుడు గరిటెతో బాగా కలిపి శుభ్రమైన సీసాలో పెట్టుకోవాలి— చక్కెర యిష్టాయిష్టాలనుబట్టి ఎక్కువ తక్కువలు వేసుకోవాలి. నిమ్మరసానికి మాత్రం 1 టికి 4 కప్పులు చక్కెర వేయాలి. మంచిజెల్లీ తయారవుతుంది.

## గడ్డి హల్వా

1 తులం జొన్నగడ్డి, ½ శేరు నీళ్లు, ¼ శేరు పాలు, చిటికెడు యిష్టమైన రంగు, చిటికెడు యాలకపొడి, 20 తులాలు చక్కెర.

పాలు నీళ్లు కలిపి పొయ్యిమీద పెట్టి జొన్నగడ్డి సన్నగా త్రుంచి అందులో వేయాలి కరిగేక చక్కెరపోసి 10 ని. బాగా కాగనిచ్చి యిష్టమైన కలరు యాలకల పొడి వేసి. దించి ఒక వెడల్పాటి గిన్నెగాని పళ్ళెంగాని ఒక చోట కదలకుండా పెట్టి దానిలోకి ఈ పాలు వడపోతగరిటెతో వడపోయాలి. 2, 3 గంటలవరకు ఎంతమాత్రం కదిలించగూడదు. చక్కని హల్వా తయారు! ఎండాకాలం ఐస్‌క్రీంకన్నా రుచి—ఆరోగ్యము- కూడా !! ఉదయం వంటకాగానే ఆ పొయ్యిమీద చేసిపెట్టేస్తే మధ్యాహ్నం కాఫీలవేళకు తయారుగా ఉంటుంది. పాలు, రంగు, సువాసనలు యిష్టాయిష్టాల ననుసరించి. పాలు బొత్తిగా లేకుండా నీళ్లతో కూడా చేయవచ్చును. ★

# ★ ఇరుగూ - పొరుగూ ★

వాళ్లు పెళ్ళయిన కొత్తలో ఇల్లాగే పండుగ వస్తే చెప్పకపోయినా వాళ్ళాయన 30 రూ. పెట్టి అప్పుడేవో కొత్తరకాల చీరలొస్తే ఒక చీర తనకు తీసుకు వచ్చాడనిఅయినా వాళ్ల అన్యోన్యం అటువంటిదని ఇంకా ఏమో చెప్పుకుంటూ పోతోంది.

ఆవిడ చెప్తున్నంత సేపూ నా వొంటిమీద తేళ్లు జెర్రులు పాకినట్టుగానే వుంది. అందరూ అలా తెస్తారుగా కదా? పోనీ అడిగి పండుకేనా ఒకచీర తేకూడదా నావిూద ఆపేక్షవుంటె తేరా అని ఈ విధంగా ఆలోచనలు రేగుతున్నాయి. నా ప్రక్కని కూర్చున్న యిల్లాలు ఎంతకూ నేమాట్లాడక పోయే సరికి లేచి వెళ్ళిపోయింది.

సాయంత్రమయింది నాకు అన్నింటికి సహాయపడుతూ నేను ఒక పూట కనుపించక పోతే ఎలావున్నానో అని ఆప్యాయత చూపించే ఇంకొక పొరుగావిడ వచ్చింది. ఆవిణ్ణి నేను పిన్నిగారూ అని పిల్చేదాన్ని.

ఆవిడ వస్తూనే ఏమమ్మా లక్ష్మి, పగలల్లా ఒక్కసారి కనుపించలేదూ? ఎలావున్నావో ఏమిటో అని చూసేందుకు వచ్చాను. మీ పిన్నిగారిమీద కోపం వచ్చిందా అని అడిగే సరికి నాకు దుఃఖం పొంగి వచ్చింది.

ఆవిడ సంగతంతావిని అందికదా, పిచ్చి పిల్లా! అలా చీటికి మాటికి కళ్లనీళ్లు పెట్టుకో కూడదమ్మా. భార్యా భర్తల మధ్య ఆపేక్ష లెప్పుడూ చీరలతోటి నగలతోటి కొలవ కూడదమ్మా. అతని దగ్గిర నిజంగా డబ్బు లేకే తేలేదేమో. నువ్వు పేచీ పెట్టి చీరకొనిపించుకుంటావనుకో. ఆ చీరకట్టుకున్నప్పుడల్లా ఓహో; ఆవేళనాతో పోట్లాడి తెప్పించుకున్న చీరకాదూ అంటె ఎంతసిగ్గుగా వుంటుందో చూడు. అందుచేత ఈ పక్కసారికి నీపెట్టెలోవున్న కొత్త చీరేదినా కట్టుకుని పండుగ సంతోషంగా గడిపెయ్యి. అసలు అతనికి నీకు చీరతేలేదని కోపమొచ్చినట్టె తెలియకూడదు. నామాటల విలువ వచ్చే పండక్కి చూద్దుగాని. అసలప్పుడీ పిన్ని గారు జ్ఞాపకమేరాదులే అని నవ్వుతూ "అతను వచ్చే వేళయింది. మొహంకడుక్కు బొట్టుపెట్టుకుని నవ్వుతూ పల్కరించమ్మా" అంటూ వెళ్లిపోయారు.

ఆవిడ మాటలతోనే నాకోపం పోయింది. ఆపండుగ అల్లాగే గడిచింది. తరువాత మా కాపూరినుంచి బదిలీ అయింది, నాకు కొంచెము గృహిణిగా అనుభవమూ కల్గింది. మళ్ళీ పండుగకు నేను చెప్పకుండానే 50రు.ల బెంగుళూరు చీర తెస్తూ "పాపం! లక్ష్మి క్రితం పండక్కి కూడా చీర తేలేకపోయాను. ఈచీర నీకు బాగుంటుందని తెచ్చాను. కట్టుకో" మన్నారాయన. పాపం ఆయనకేమి తెలుసు అప్పుడు నాకు బాగా కోపమొచ్చిందని. చల్లారిపోయిందనీను? అప్పుడు నాకు ఆపిన్నిగారి మాటలు జ్ఞాపకమొచ్చి నామనస్సులో ఆమెకు కృతజ్ఞత తెల్పుకున్నాను. ఆ పిన్నిగారి పొరుగులాటి పొరుగునే అంటూంటారు మన పెద్దవాళ్లు; "దూరదేశాల్లో తల్లీతోడ్లలే ఆదుకునేవారు ఇరుగు పొరుగులే సుమీ" అని. ★




# నాన్న కథ

శ్రీ ఉలారిపాటి అనంతరామయ్య

మీరేమొ నాన్నను
మెచ్చుకొంటారు;
ఒక చిన్నిపనియు, నా
న్నకు చేతకాదు!

ఎప్పుడూ, ఏ చదువో.
ఏ వ్రాతో, ఇంతే;
ఇంటిలో అటు చెంబు
ఇటు పెట్టబోడు.

పెసరట్లు కాజేయ
వేగిరమె వచ్చు;
ఉల్లిపాయల నొలువ
డొకన్నాడు గూడ.

అమ్మకేనాడు సా
యము రాడు, పోనీ,
తన సొంత పనిఅయిన
తా జేసికోడు.

స్నానాని కొక్కట
ట్టాన లేవడుగా,
నీరుతోడిన అమ్మ
పోరితేగాని.

బువ్వతిని, తాంబూల
మే వేసికోడు;
ఆకు మడుపుల నమ్మ
అందీయకుండ.

తనయంత తాను తన
తల దువ్వుకోడు;
పనిమాని, అమ్మ దూ
వెను రాయకుండ.

పెట్టెలో చాకింటి
బట్ట లుండునుగా?
అవికూడ అమ్మయే
అందీయవలెన!

# పులితోలు

స్థలం: పొలంలో.

[సుబ్బులు, రాము ప్రవేశం]

సుబ్బులు: అన్నాయ్! మరేఁ నాకేఁ ఆకలవుతుంది. నాన్నయింకా రాలేదేఁ?

రాము: వస్తాడు ఉండూ మరి. ఈకాస్తకే ఆకలంటే అసలు పొలమెందుకొచ్చావ్?

సుబ్బులు: ఇంత ఆకలవుతుందనుకొన్నానా?

రాము: కొంచెం ఓపికపట్టవే అన్నాలు తెచ్చే వేళయింది. అసలు వస్తున్నారేమో చూడు.

సుబ్బులు: ఇలా అయితే ఇకనే నెప్పుడూ పొలంరాను. ఇంటిదగ్గరే వుంటాను. అమ్మేఁ, నాకు సెనగపప్పూ బిళ్ళలు కొనిపెడుతుంది కూడా.

రాము: ఈ కొంచెం ఆకలికే ఆగలేవటే చెల్లాయ్! నేను ఒక్కొక్కనాడు ప్రొద్దున్నే పొలంవచ్చి, అర్ధరాత్రివరకూ యిక్కడేపొలంలో ఆడుకొని మరలా నాన్న వచ్చేటప్పుడు యింటికివస్తే అప్పుడు నీవు నిద్రపోతూండేదానివి కదూ?

సుబ్బులు: నువ్వు నాకంటే పెద్దవాడివి కాదయ్యామరి?

రాము: నిజమేగాని (ఆలోచిస్తూ) నాజేబులో కొద్దిగా సెనగపప్పు లున్నాయి. వాటిని తింటూ ఆడుకొందాం. ఇంతలో నాన్న వస్తాడు, ఇంటికిపోదాం. సరేనా?

పాత్రలు:
రాము.
సోము: అతని స్నేహితుడు.
సుబ్బులు: అతని చెల్లి.
ప్రసాద్.
సీతి: అతని చెల్లి.
రంగయ్య: వాళ్ల నాన్న.
మామయ్య.

సుబ్బులు: [సరేనన్నట్లుతలూపుతుంది.]

రాము: ఏమాట ఆడుకొందాం చెల్లాయ్?

సుబ్బులు: నేను నడువలే నన్నాయ్! (కూర్చుండును.)

రాము: ఎక్కడికీ పోవద్దు. ఇక్కడే ఆడుకొందాం. (ప్రక్కకు చూచి) అడుగో సోముకూడా వస్తున్నాడు.

సుబ్బులు: (ఉత్సాహంతో) ఏడీ?

రాము: అడుగో ఆచెట్లచాటుకు వచ్చాడు. బలే బలే గమ్మత్తులు చేస్తాడులే! వాడుంటే మనకి ఆకలి కూడా పోతుంది.

[సోము ప్రవేశిస్తాడు.]

కవిరావు

సోము: ఏరా రామూ! ఏం చేస్తున్నార్రా?

సుబ్బులు: ఆడుకొంటున్నాం.

సోము: ఏం ఆట?

రాము: మాచెల్లికి ఆకలవుతుందిరా!...

సోము: అయితే?

రాము: నాదగ్గర కొంచెంసెనగపప్పు ఉంటేనూ, వాటితో 'అన్నం ఆట' ఆడుకొంటున్నాంలే.

సుబ్బులు: నువ్వుకూడా వస్తావా, మా ఆటలోకి?

సోము: ఓ! (వారి ప్రక్కనే కూర్చుంటాడు. రాము, కాస్తసెనగపప్పు పెడతాడు. సోము తింటూ ఏదో ఆలోచించి) మరంటూ యీ పొలంలో ఒక పెద్దపులి తిరుగుతుందంట.

రాము: (భయంతో) పెద్దపులా?

సోము: ఆ. ఒంటరిగా తిరగవద్దని మానాన్న చెప్పాడు.

సుబ్బులు: (భయంతో) అన్నాయ్! ఎల్లాగూ? నన్ను అమ్మ దగ్గరకు పంపెయ్యి. అమ్మో పులి వస్తుందేమో? (ఏడుపు మొదలు పెడుతుంది.)

రాము: (ఓదార్చుతూ) లేదమ్మా! పులీరాదు గిలీరాదు. మనం పొలం రాకుండా వుంటామనీ, పెద్దాళ్ళు అట్లాగే చెప్పతుంటారు చెల్లాయ్!

సోము: అసలు వస్తేమాత్రం ఏంచేస్తుందేం? మనం ముగ్గురం ఉంటేను.

సుబ్బులు: ఏమో, నాకుభయం వేస్తోం దన్నాయ్.

సోము: నీలాంటి 'మంచి'పిల్లల్ని తినదు. షావుకారు రంగయ్యగారి అమ్మాయి వుండే, సీతీ; దాన్ని వాళ్ళ అన్నయ్య ప్రసాద్ లేడూ?

వాణ్ణీఅయితే పట్టుకొని యెత్తుక పోతుంది.

రాము: ఏడిస్తే అసలు వస్తుంది. ఏడవకూడదు. తెలిసిందా?

సుబ్బులు: [కళ్ళు నలుపుకుంటూ సరేనన్నట్లు తలూపుతుంది]

రాము: ప్రసాద్ వట్టి అల్లరి వాడు రా!

సోము: సీతి తక్కువనుకొన్నా!

సుబ్బులు: మరేఁ మొన్నేఁ నన్నేఁ గిల్లీ, పారిపోయింది.

రాము: ఇంకేఁ! అటువంటి వాళ్లనే పెద్దపులి తినేది. మనజోలికి రాదు.

సుబ్బులు: మరేఁ మనం మంచి పిల్లలం కదూ?

సోము: అదుగో! అక్కడే వాళ్ల చావిడికూడా వుంది. వాళ్లు రోజూ అక్కడికి వస్తారు.

రాము: వాళ్లకి చాలా పొలం వుంది. వాళ్లకేం? మారాజులు. వాళ్ల నాన్న వాళ్ళకి ఏది కావలిస్తే అది తెచ్చిపెడతాడు.

సుబ్బులు: నాకేఁ...మొన్నేఁ... మా నాన్నేఁ...గౌను తెచ్చాడు.

రాము: వాళ్ల చేనిదగ్గరికి పోతే మనకు కండెలు పెట్టడు.

సోము: వాడిసంగతి నీకు తెలియదులే. వట్టి పీనాసి.

రాము: మొన్న నా దగ్గర గారె వుంటేనూ, సగంపెట్టలా?

సుబ్బులు: అన్నాయ్! మన అమ్మే పండక్కి గారెలు వండుతానంది. అప్పుడువాళ్ళకిపెట్టొద్దు. ఏం?

రాము: వాళ్ళ నాన్న యినా ఇస్తాడులేరా! నేను వాళ్ళ యింటికి ఎప్పుడెళ్లినా ఏదో ఒకటి పెడుతుంటాడు. రంగయ్య చాలా మంచి వాడురా!

సోము: [ఆలోచిస్తూ వుంటాడేదో]ఏమోరానాకేంనమ్మకంలేదు.

రాము: మా నాన్నను కూడా అప్పుడప్పుడు పిలుస్తుంటాడు.

సుబ్బులు: అన్నాయ్! మరేఁ, మన అమ్మానూ, సీతిగా రమ్మానూ పోట్లాడుకున్నారు.

సోము: [ప్రక్కచూచి] అదుగోరోయ్! సీతి ప్రసాదూను. వాళ్ల నాన్న వెంట వస్తున్నారు.

రాము: [చూచి] ఇటే వస్తున్నారే! ఏదో చేతుల్లో వుందిరా తెగతింటున్నారు.

సుబ్బులు: అన్నాయ్! నాక్కూడా చూపించవూ?

రాము: [సుబ్బులకు చూపిస్తూ] కంచెచాటుకు వచ్చారు. నీకు కనిపించరులే.

సోము: నిజంగా పెద్దపులి వచ్చి వాళ్లని తిని, వాళ్ళు తినేవి ఏమిటో గానీ అవి మనకు వదలిపెడితే...!

సుబ్బులు: అన్నాయ్! పెద్దపులంట. నాకు భయం వేస్తోందన్నాయ్!

రాము: [విసుగుతో] అబ్బబ్బబ్బ! మళ్లీ మొదలు.

సుబ్బులు: [బిక్కమొగంతో] అలా అయితే నన్ను అమ్మ దగ్గరకు పంపెయ్.

సోము: [ఏదో ఆలోచిస్తూ వుంటాడు]

రాము: కొంచెం ఓపిక పట్టు, పంపేస్తాను.

సోము: [ఏదో బుఱ్ఱకు తట్టినట్లు పోజుపెట్టి] మా చేనిదగ్గర ఒక పెద్ద పులి శర్మం వుందిరా...!

రాము: [ప్రశ్నార్థంగా] ఉంటే?

సోము: ఉంటేనా? (రాము చెవిలో ఏదో చెపుతాడు)

సుబ్బులు: నాక్కూడా!

(సోము మరలా సుబ్బులుచెవిలో చెపుతాడు)

సుబ్బులు: నాకు భయం వేస్తోందన్నాయ్!

రాము: [సుబ్బులుమాట వినిపించుకోకుండా] బలే ఉపాయంరా! (ఆలోచించి) మరి వాళ్ళ నాన్న ఉండడూ?

సోము: వాళ్లని అదుగో ఆ చెట్టుకింద వదలి కూలీలకోసం పోతాడు. ఇంతలో మనం ఆ పని కాస్తా పూర్తి చేయాలి.

రాము: ఓరి నీ బుఱ్ఱ తగలెయ్యా! ఎంత తెలివిరా నీది!

సుబ్బులు: అన్నాయ్! అమ్మదగ్గరకు పంపవూ?

రాము: [సోముతో] సరే. అలాగే చేద్దాముురా!

సుబ్బులు: ఏం అన్నాయ్! అమ్మదగ్గరకు (ఏడుపుముఖంతో.)

రాము: (కోపంతో) దీన్నన్నా తినదేర పులి. పీడావదిలిపోతుంది.

సోము: కోప్పడకురా! పాపం! ఆకలవుతుందికాబోలు.

సుబ్బులు: [చేత్తో కళ్లునలుపుకొంటూ వెక్కి వెక్కి యేడుస్తూ.] ఉండయ్యా! అమ్మతో చెప్పీ, యేం చేస్తానో!

రాము: (ఓదార్పుతూ) కాదు చెల్లాయ్! ఏడిస్తే పెద్దపులివస్తుందని చెప్పలా?—మరి యేడుస్తావేం?

సోము: సీతిదగ్గరా, ప్రసాదు దగ్గరా మంచి మంచి కాయలూ చాక్లెట్లూ వుంటాయ్. అవి అన్నీ మనం తీసుకొని కమ్మగా తిందాం. ఏం?

రాము: ఏడవకుండా వుంటే ఎన్నో చాక్లెట్లూ పెడతాం సరేనా?

 # పులితోలు 

సుబ్బులు: (కళ్లు నలుపుతూనే) అన్నీ నాకే కావాలి.

రాము: సరేలే. అన్నీ నీకే. ఏడవకుండా మావెంట వుండు.

సుబ్బులు: (సరేనన్నట్లు తల ఎగరవేస్తుంది.)

సోము: త్వరగారండి! వాళ్లువస్తున్నారు. మనపనిలో మనంఉందాం.

[ముందు సోమూ, వెనుక సుబ్బులుచేయి పట్టుకొని రామూ నిష్క్రమిస్తారు. ఒక నిముషం తర్వాత, రెండవ వైపునుండి రంగయ్య, ప్రసాద్, సీతి ప్రవేశిస్తారు. ప్రసాదు సీతి ఏవో తింటూ వుంటారు. రంగయ్య పొలంవైపు చూస్తూ వుంటాడు]

రంగయ్య: [అవతల తొందర పని వున్నట్లు] అరే! ప్రసాదూ! ఇక మీ రిక్కడ ఆడుకొంటూ వుండండి. నేను పోయి కూలీలను తీసుకొస్తా. అమ్మాయి జాగ్రత్త ఎటూ వెళ్లకండి.

సీతి: నాకు మంచి మామిడి కాయలు తెస్తావా

రంగయ్య: తెస్తాగానీ, అన్నాయి దగ్గరే వుండు.

ప్రసాద్: ఇక్కడే పెద్దపులి ఉందిటగా? మాకు భయంవేస్తోంది నాన్నా!

(ఏవో తింటూ మాట్లాడడంచేత గొంతు పొరపోతుంది. నెత్తి కొట్టుకొంటూ దగ్గుతాడు)

రంగయ్య: [ప్రసాద్ గొంతు సవరిస్తూ] తిండి! ఒకటే తిండి! తిని మాట్లాడరాదూ?

సీతి: పెద్దపులైతే నాకు భయం నాన్నా!

రంగడు: అదుగో అక్కడ మన పాలేరు సుబ్బడున్నాడు. ఏంభయం? నే నిప్పుడే మన పెద్దచేను దగ్గరకు పోయివస్తా.

సీతి: తొందరగా రావాలి. లేకపోతే నాకుభయం.

రంగయ్య: లేదమ్మా! వెంటనే వస్తాను. ఒరే! ప్రసాదూ! అమ్మడు జాగ్రత్త! మీరిక్కడే ఆడుకొంటూ వుండండి. మీ మామయ్య ఈదారినే వస్తాడు. పండక్కి వాళ్ళింటికి తీసుకుపోతాడు.

ప్రసాద్: మాకేమన్నా తెస్తాడా మామయ్య?

రంగయ్య: నీకు కొత్తచొక్కాలూ లాగులూ, అమ్మడికి గౌనూ తెస్తాడు.

సీతి: మరేఁ నాన్నా! నేను మామయ్యగారి యింటికి పోతేనే, నేనేఁ మరేఁ చిట్టినెత్తుకొంటా.

రంగయ్య: ఉండండి! నేను కొంచెంసేపట్లో తిరిగివస్తాను.

[నిష్క్రమించును]

ప్రసాద్ } [రంగయ్యవైపుచూస్తూ]
సీతి } తొందరగా రావాలి.

సీతి: నాన్న తొందరగా రాకపోతేనే మనకు భయంకదూ? (ఏదో జ్ఞప్తికివచ్చి) మరేఁ అన్నాయ్! పెద్దపులి వస్తుందా?

ప్రసాద్: సీతి! సీతి! అదుగో పెద్దపులి వస్తుంది.

సీతి: [భయంతో] ఆఁ! ఏదీ?

ప్రసాద్: [నవ్వుతూ] వట్టిదేనే! (ఇంకొకవైపు చూచి) అదుగో మామయ్య.

సీతి: [సంతోషంతో] ఏడియేడి..?

ప్రసాద్: [నవ్వుతూ] వట్టిదేనే! గమ్మత్తుచేశాను...

సీతి: నాకేంలే ఆశపెడితే ఆశ కుదిప లేస్తుందిలే.

ప్రసాద్: [ఆలోచిస్తూ] ఈసారి మామయ్యగారి యింటికి పోతేనే వాళ్ళ కుక్కపిల్లని ఎవ్వరూ చూడకుండా తేవాలి.

సీతి: నాన్న ఈపాటికి మన పెద్ద చేనుదగ్గరకు పోయివుంటాడు. మామయ్య వస్తూవుంటాడు.

ప్రసాద్: మామయ్య వచ్చేదాకా యీ బఠాణీలు తిందాం.

[బఠాణీలు సీతికి పెడతాడు]

[ఇంకా వుంది]

అమెరికన్ మోషన్ పిక్చర్ అకాడమీ వారు 1956 సంవత్సరానికి ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్, యుల్ బ్రెనర్‌లను ఉత్తమ నటీ నటులుగా ఎన్నిక చేశారు.

జూల్స్ వెర్న్ రచన ఆధారంగా మైకెల్ టాడ్ నిర్మించిన "అరౌండ్ ది వరల్డ్ ఇన్ 80 డేస్" (80 రోజులలో భూప్రదక్షిణం) ఉత్తమ చిత్రంగా ఎన్నిక అయింది. ఇది న్యూయార్క్ ఫిలిం విమర్శకులు కూడా ఎన్నిక చేసిన చిత్రమన్న విషయం విదితమే. భారీ సెట్స్, రంగులూ మొదలైన హంగుల దృష్ట్యానే కాక, అన్నివిధాలా ఇది మెచ్చతగ్గ చిత్రం అనిపించుకుంది. ఇందులో కాంటిఫ్లాస్ అనే మెక్సికన్ నటుడిని చూచిన తరువాత, 'కాంటిఫ్లాస్ హాస్యనట శ్రేష్ఠుడని చార్లీ చాప్లిన్ మెచ్చుకున్నారు.



రాజ్‌కపూర్ కొత్త చిత్రం "అబ్ దిల్లీ దూర్ నహీం"లో మోతీలాల్, మాస్టర్ రోమీ.

"అనస్టేషియా" అనే చిత్రంలో నటనకు ఇన్‌గ్రిడ్ (జోన్ ఆఫ్ ఆర్క్) బెర్గ్‌మన్ ఉత్తమ నటిగా ఎన్నిక అయి, 'ఆస్కార్' బహుమతి పుచ్చుకొంది. 1918 విప్లవంలో వధించబడ్డ రష్యన్ చక్రవర్తి రోమనాఫ్ ఆఖరి కూతురు అనస్టేషియా కథ ఆధారంగా తయారైన ఈ చిత్రంలో, ఈమె ముఖ్య భూమిక నిర్వహించింది. యూల్ బ్రైనర్, అకిం టామిరాఫ్ ప్రభృతులు పాల్గొన్నారు. సరిగా ఈ చిత్రంతోపాటు బ్రిటన్‌లో ఇదే కథను మరొకరు చిత్రంగా నిర్మించారు. దాని పేరు కూడా చిత్రంగా ఉంటుంది. "అనస్టేషియా అనా అండర్సనేనా?" అనే ప్రశ్న దీనికి పేరు. ఈ అనా అండర్సన్ అనే ఆవిడ ప్రస్తుతం జర్మనీలో ఉంది. బోల్షివిక్ విప్లవంలో హతమైపోయిన జార్ కుటుంబంలో, అనస్టేషియా ఒక్కర్తె మాత్రం ఎలాగో తప్పించుకుని యూరప్ వచ్చిందని, ఆవిడే ఈమె అని అంటారు. బ్రిటిష్ నిర్మాతలు ఈ అనాను కలుసుకొని ఆమె చెప్పినదీ తమకు తెలిసినదీ కలిపి డాక్యుమెంటరీ పద్ధతిలో చిత్రాన్ని రూపొందించారు. ఈ బ్రిటిష్ చిత్రంలో అనస్టేషియా భూమికను లిలి పామర్ (రెక్స్ హారిసన్ భార్య) నిర్వహించింది.

ఉత్తమ నటుడికి ఇచ్చే అకాడమీ అవార్డును "ది కింగ్ అండ్ ఐ" చిత్రంలో నటనకు యుల్ బ్రెనర్ సంపాదించాడు. పది పదిహేనేళ్ళ క్రితం ఇదే కథ "అన్నా అండ్ ది కింగ్ ఆఫ్ సయాం" పేరిట చిత్రంగా తయారైంది. అందులో రెక్స్ హారిసన్, ఐరీన్ డన్ నటించారు. ఇప్పుడు వచ్చిన చిత్రం మొదట బ్రాడ్వే నాటకంగా పేరు తెచ్చుకుంది.

ఉత్తమ సహాయనటుడు ఆంథోని క్విన్ (చిత్రకారుడు విన్సెంట్ వాన్‌గో జీవిత గాథను చిత్రించిన "లస్ట్ ఫర్ లైఫ్" లో వాన్‌గో అన్నగా నటించాడు. వాన్‌గో భూమికను కర్క్ డగ్లస్ నిర్వహించాడు.)

సహాయనటి డరోతి మెలోన్ (...... చిత్రంలో నటనకు.)

ఇతర బహుమతుల వివరాలు:

ఉత్తమ దర్శకుడు జార్జి స్టీవెన్స్ ('జైంట్' చిత్రానికి.)

శబ్దగ్రహణం—"కింగ్ అండ్ ఐ" (ట్వంటియత్ సెంచరీ ఫాక్స్.)

ఛాయాగ్రహణం (రంగులతో) లయను

# రామభక్తుడు

(12-వ పేజీ తరువాయి)

చేసిన ధనాన్ని—అన్యథా—నూతన పాఠశాల స్థాపించటంకోసం ఉపయోగపర్చ ప్రయత్నిస్తున్నారట"—అని ఆ వ్యక్తి అంటూంటే.

"చిత్రం... ఈవూరికి పాఠశాల అవసరం ఎంతైనావుంది ... కానీడబ్బు యిచ్చే దాతలు లేకపోయారు. అందువల్ల..." రంగనాథరావుగారు ఏమో యింకా అనబోయారు!

"మీరా మొత్తాన్ని సద్వినియోగమే చేసినట్లు తలుపవచ్చు! కానీ ఆరామచంద్రుల ఆలయనిర్మాణంకోసం వసూలు చేసిన ధనాన్ని యితరత్రా వుపయోగించటం—అపచారంగానే భావిస్తున్నాను. గత మూడు రోజులనుంచీ యేకారణంచేతనో నామనస్సు తిన్నంగా వుండటంలేదు! రెండురోజుల క్రితం—రాత్రిఆసీతారాములు వెలవెలపోయే వదనాలతో నాకు కలలోకన్పించారు! చేసినఅపరాధంయేమిటో తెలియక నే వ్యధ చెందుతూండగా—యీవార్త నాకు నిన్న సాయంకాలమే తెలిసింది! వెంటనే బయలుదేరివచ్చాను. ఆసీతారాములసొమ్ము-మీరన్యథావినియోగిస్తూంటే నేసహించలేను"—అన్నారు దీనంగా నారాయణరావుగారు! డాక్టరు రంగనాథరావుగారి కళ్ళు చమర్చాయి: "మీరు మహాభక్తులు. ఆ సీతారాములకోసం వసూలుచేసిన ధనాన్ని అన్యథావినియోగపరుప ప్రయత్నించినందుకు మీరు మమ్మల్ని మన్నించాలి! ఏంచేయం? అంతకన్న వేరుమార్గం లేకపోయింది—ఆడబ్బును ఆధారంగాతీసుకొని, పై అధికార్లకు కాగితాలు వ్రాయటంఅయిపోయింది నేడో, రేపో నేపైకివెడదామనుకుంటున్నాను. ఈలా సాహసించి—నందుకు మిమ్మల్ని హృదయపూర్వకంగా క్షమాపణ కోరుకుంటున్నా"—అని ఆయన అంటూంటే,

నారాయణరావుగారు వుద్వేగంతో: "మీరేంచేసినా సరే! నేసహించను. ఆసీతారాములకొరకు ప్రోగుచేయబడిన ధనం—వారికేవుపయోగపడాలి"-అన్నారు!

"మరి పై అధికార్లకు—అనుజ్ఞలకోసం వ్రాసిన పాఠశాలగతి"—వెల, వెలబోతూ అడిగారు డాక్టరుగారు!

"ఆమొత్తానికి యిప్పుడే నేను మీపేర చెక్ వ్రాసి యిస్తున్నాను. బ్యాంకులో మార్చుకోండి"—అంతేకానీ — దైవానికి అపచారంచేయ ప్రయత్నించకండి"—అంటూ, తమసంచీలోంచి చెక్ పుస్తకంతీసి, రంగనాథరావుగారిపేర ఏభైవేల రూపాయలకు చెక్ వెంటనే వ్రాసియిచ్చారు నారాయణరావుగారు!

రంగనాథరావుగారు ముందుగా తెల్లబోయారు! వెనువెంటనే, ఆనందం ఆయనలో ప్రవేసించింది; కళ్లలో సంతోషపునీళ్లు నిండగా, నారాయణరావు గారికి నమస్కరిస్తూ. "మీరు మహాభక్తులు మీరు చూపించినదయ, దైవప్రేమ—యీగ్రామంలో యెవరూ మరచిపోరు! మీ ఔదార్యంచేతా-ఆ సీతారాముల దయ వల్లా యీ గ్రామంలో యేర్పడబోతున్న ఉన్నతపాఠశాల రామభక్త నారాయణరావు ఉన్నత పాఠశాల అవుతుంది. మీ మూలకంగా యిక్కడ స్థలపురాణం ఏర్పడుతుంది. నాకోరిక ఒకటివుంది. అది మీరు మన్నించాలి"—అన్నారు!

"అంతా ఆ సీతారాములదయ. ఏమిటది?"—అడిగారు, రామభక్త నారాయణ రావుగారు!

"రామదాసు రామభక్తుడు—భద్రాద్రి రామాలయాన్ని బాగుచేయించి-వుత్సవాలు చేశాడు! ఇక్కడ ఈ రామాలయాన్ని కూడా ఒకభక్తుని ఆధ్వర్యంలో నిర్మాణం చేయించి, వుత్సవం జరిపించాలని మాకు వుంది. ఈ కోర్కె మీరు మన్నించాలి"-అని, రంగనాథరావుగారంటూంటే,

"అంతా ఆ సీతారాములదయ"—అన్నారు మందహాసంచేస్తూ; నారాయణ రావుగారు.

ఆ గ్రామంలో, నారాయణరావుగారి ఆధ్వర్యాన నిర్మించబడిన రామాలయ ప్రారంభోత్సవం, రామభక్త నారాయణ రావు వున్నత పాఠశాల ప్రారంభోత్సవం-యించుమించుగా ఒకేమారు జరిగాయని విడిగా వ్రాయనవసరం లేదనుకుంటాను.

★

# న్యూఢిల్లీ లేఖ

(౮-వ పేజీ తరువాయి)

సూయజ్ కాలువలో రాకపోకలాగి పోయినందువల్ల మధ్య ప్రాచ్యంలో మనకు పెద్దమార్కెట్ ఏర్పడింది. భారతదేశంపై కావలసినంత గౌరవంకూడా అక్కడఉంది. అయినా ఆ మార్కెట్‌ను చేజిక్కించుకోవాలన్న ప్రయత్నమెవరూ చేయలేదు. సేల్స్‌మన్‌షిప్ లేకపోవడమే దీనికి కారణం.

అంకర్‌వాట్‌లో హిందూ దేవాలయాలున్నాయి. అవి ఈనాటికీ సురక్షితంగా ఉన్నాయి. వాటినిచూసి మనం పాఠం నేర్చుకోవచ్చును. ఏ సదుపాయాలూ లేని ప్రాచీనకాలంలో భారతీయులు తమనాగరికతను దూరప్రాచ్యదేశాలకు వ్యాపింపజేశారు. ఇప్పుడు ఆధునికసౌకర్యాలన్నీ ఉన్నరోజుల్లో కూడా భారతీయ వర్తకులకు తగిన ఉత్సాహం లేక ఇరుగు పొరుగు దేశాలతో వాణిజ్యసంబంధాలను అభివృద్ధి చేసుకునే ప్రయత్నమైనా చేయడంలేదు.

జాతీయవాదం ఒకరి గుత్తసొమ్ము కాదు. భారతీయ వ్యాపారంలో విదేశీయులు పాల్గొనడం భారత దేశానికిష్టంలేకపోతే, తమ వ్యాపారంలో భారతీయులు పాల్గొనడం విదేశీయులకూ కష్టంగానే ఉంటుంది. ఇది మనవారు గ్రహించి వ్యవహరించాలి. కాని ఒకటి. యూరప్, దక్షిణ అమెరికా దేశాలు, తమ ఆర్థిక వ్యవస్థలను సమష్టిగా సంఘటితం చేసుకుంటున్నాయి. సమష్టిఆర్థిక సంఘాలను, సమష్టి మార్కెట్లను ఏర్పాటు చేసుకుంటున్నాయి. కాని ఆసియారాజ్యాలు తమలో తాము ఆర్థిక ఐకమత్యం నెలకొల్పుకోడానికి ఏ ప్రయత్నమూ చేయడంలేదు.

అయితే ఒకరంటే ఒకరికి భయం ఉండడం ఒక కారణం కావచ్చు. వర్తక వాణిజ్యాల ఉద్యమం ద్వారానే వలసవాదం బయల్దేరింది. ఆసియా, ఆఫ్రికాలలో వర్తకం చేసుకోడానికి వచ్చిన పశ్చిమ రాజ్యాలే ఇక్కడ వలసలేర్పరచుకున్నాయి. ఇప్పుడీ వలసలు స్వాతంత్ర్యం పొందాయి. పెద్దరాజ్యాలంటే వీటికిభయం ఉండడం సహజం. కనక పెద్దరాజ్యాలు చిన్న రాజ్యాల అనుమానాలను పోగొట్టడానికి ప్రయత్నించాలి. వాణిజ్యరంగానికి పంచశీలను అన్వయించాలి. భారతదేశానికే లాభకరమైన వ్యాపార విధానంగాని, లేక ఇతర దేశాలకే లాభసాటిఅయిన విధానం కాని జయప్రదం కాదు, ఆచరణసాధ్యం కాదు. ఉభయత్రా అది లాభసాటి కావాలి. “ఉత్పత్తి చెయ్యి; లేకపోతే ఉత్పాతం తప్పదు” అనేసూత్రం పాతబడిపోయింది. భారత దేశాభివృద్ధి దృష్ట్యా అనుష్ఠించాల్సిన కొత్తసూత్రం ఏమిటంటే “ఎగుమతి చెయ్యి. లేకపోతే దిగజారి పోతావ్,” అని. ★

# పరమ శివార్చన 

[23 వ పేజి తరువాయి]

ఆనాడు మాఘమాస శివరాత్రి. భవంతికి రాగానే మంత్రి మళ్ళీ స్నానంచేసి పరమశివార్చన కుపక్రమించాడు. దశ సహస్ర పంచాక్షరీమంత్ర జపంతో అతని మనస్సోంకార తరంగడోలికలలో ఓలలాడింది. అతని హృదయం భూతేశ్వర పాదపద్మధ్యానంలో నిశ్చలమై నిలిచింది. అతని కనుగొలుకుల నుండి అప్రయత్నంగా ఆనందబాష్పా లేకధారగా ప్రవహించాయి.

మంత్రి అటుపిమ్మట అలాగే శివ పంచాక్షరీ మంత్రం పునశ్చరణ చేస్తూ కూర్చున్నాడు.

అంతలో అతని పూజాగృహానికి పార్శ్వంలోఉన్న గదిలోనుంచి ఏవో గుసగుసలు, బెదిరింపులు, హెచ్చరికలు వినిపించాయి. ఆపైన ఎంత ప్రయత్నించినా మంత్రి హృదయాని కేకాగ్రత కలగలేదు.

ఆ పక్కగదిలో అతనిభార్యజయమంగళ, కుమారుడు పినాకధన్వ కేమేమో బోధిస్తూంది. మొట్టమొదట ఆమె అతని నెంతో ఆప్యాయంగా బతిమాలుకుంది:

"నీకీ కటిక బందిపోటులతో సహవాస మెందుకు నాయనా! నీకేమి లోటని! కావలిస్తే నా రత్నాభరణాలన్నీ తీసుకుపో! నీ యిష్టం వచ్చినట్టు వినియోగించుకో! ఇది మీ నాయనగారికి తెలియనివ్వనులే. అంతే గాని శివద్రవ్యం జోలికిపోకు ధన్వా! మీ తాత ముత్తాతలందరు భూతేశ్వర స్వామి కెన్నెన్నో మడిమాన్యాలు, ఎన్నెన్నో రత్న హారాలు సమర్పించుకొని తరించారు! ఇటువంటి పని ఇంకెప్పుడూ చెయ్యకు! ఇది సాక్షాత్తు కర్కోటక నాగునితో చెలగాటం నాయనా!"

జయమంగళ అతని ఇంకా ననేక విధాలుగా బుజ్జగించింది.

"అమ్మా! నావల్ల పొరబాటే జరిగిపోయిందిలే! ఇక నేనెప్పుడు ఇటువంటి పనులు చెయ్యనులే! మరి వెంటనే నీ పచ్చలహారం తీసి నాకియ్యి!"

అన్నాడు పినాకధన్వ. ఆ మాటలు మంత్రికి స్పష్టంగా వినిపించాయి. మంత్రి వెంటనే తన చేతనున్న రుద్రాక్ష జపమాల అక్కడపెట్టి, ఆ గది తలుపు సందులలో నించి అదంతా అతిజాగ్రత్తగా పరిశీలించాడు. పినాకధన్వ ముఖంలో అతనికి పశ్చాత్తాప సూచనలేవీ కనిపించలేదు. పైగా అతడది తనకేమీ పట్టనట్టుగా అలాగే నవ్వుతూ కూర్చున్నాడు .

శూరమంత్రి హృదయంలో ఒక పెద్ద పిడుగుపడింది. అంతలో జయమంగళ తన మెడలోని పచ్చలహారం తీసి కుమారునిచేతి కందించింది.

ఇక మంత్రి నిలవరించుకోలేకపోయాడు. కాయశక్తులా ఆ గదితలుపు గట్టిగా తట్టాడు. జయమంగళ తొందరగావచ్చి ఆ గదితలుపు తెరిచింది. అంతలోనే పినాకధన్వ ఆ పచ్చల హారం చేజిక్కించుకొని ఒక్క అంగలో వీధిలోకి ఉడాయించాడు. జయమంగళం భర్త రాకడచూచి బాగా భయపడింది.

"ఏమిటిదంతా ?"

అని మంత్రి గట్టిగా గద్దించి అడిగాడు. జయమంగళ మరి లాభంలేదని గ్రహించుకుని భర్తతో జరిగినదంతా వెళ్లబోసుకుంది:

"ఏమి చెయ్యను! ఇదంతా నా ప్రారబ్ధం! మన ధన్వ నిన్న రాత్రిబందిపోటు దొంగలతో కలిసి భూతేశ్వరస్వామి ఆలయంలో అమ్మవారి పచ్చలహారం అపహరించాడట! నా కది ఈ వేళ ఉదయమే తెలిసింది. వెంటనే వాణ్ణి నయానా భయానా బుజ్జగించి, రెండో కంటివాడికి తెలియకుండా ఆహారం మళ్లీ అమ్మవారి దేవాలయానికి పంపించివేశాను. ఇకనించి వాడెప్పుడు ఇలాంటిపనులు చెయ్యనని నాకు వాగ్దానం చేశాడు. అసలే వాడు బాగా బెంబేలుపడిపోయాడు! మీ రిక వాణ్ణేమీ అనకండి! నామాటవిని కొంచెం తమాయించండి!"

శూరమంత్రి శిరస్సుపై ఇంకొక పెద్ద పిడుగుపడింది. క్షణంకాలం పాటతడు తన కళ్లే నమ్మలేక అలాగే శిలాప్రతిమలా నిర్ఘాంతపోయాడు. మరుక్షణంలో కఠినంగా గర్జించాడు:

"ఇంతటి ఘోరాపచారం జరిగినా ఇంతవరకు నాతో ఎందుకు చెప్పలేదు ?"

"శివరాత్రిపూట మీకి రభస అంతా చెప్పడాని కిష్టంలేక నేనే ఏదోవిధంగా సర్దుబాటుచేసుకున్నాను. ఏమిచెయ్యను! నేను చేసిన నోములన్నీ చివరికీ విధంగా ఫలించాయి."

అని ఆమె పైటకొంగుతో కన్నీరు తుడుచుకుంది. మంత్రి మళ్ళీ గర్జించాడు:

"నీమూలంగానే వాడీవిధంగా పచ్చి బందిపోటుదొంగగా మారిపోయాడు. దీనికంతటికీ నీవేకారణం! ఇక నేనిది భరించలేను! వాడీక్షణంనించీ నా గుమ్మం తొక్కడానికి వీలులేదు!"

మంత్రి అలాగే రోజుతూ ఆమెవైపు చూచాడు. జయమంగళ ఆమాట విని మొదలు నరికిన తరువులా నేలపై కూలబడిపోయింది. ఆపైన వలవలా ఏడవడం మొదలుపెట్టింది:

"పోనీయండి! నేనేమిచెయ్యను! నేను చేసుకున్న పుణ్యమే అంత! మీ అదృష్టం కొద్దీ మీకా మొదటి సంబంధంవల్ల రత్నంవంటి కుమారుడు కలిగాడు. నా దురదృష్టం కొద్దీనాకెంతకాలానికీ సంతానమే కలగలేదు! పోనీ అని ఒక పసివాణ్ణి దగ్గిరికితీసుకుంటే వా డిలాంటివాడై పోయాడు!"

"అయినా అయినదానికీ కానిదానికీ పసివాణ్ణిలాగ భయపెడితే ఎలాగ! ఏదో నయానా భయానా సంబాళించుకోవాలి గాని! ఈ మిట్ట మధ్యాహ్నంవేళ వాడలాగ బెంబేలుపడి ఎక్కడికి వెళ్ళిపోయాడో! ఇంతకీ నా నొసటిరాత ఈ విధంగా ఉంటే ఇంకొకరి ననవలసినపని ఏమిఉంది!"

అని జయమంగళఅలాగే కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చింది.

"వాడు పసివాడా? పాతికేళ్లు పైబడుతున్నా ఇంకా పసివాడేనా? నీ గారాబమే వాణ్ణింతవరకు తెచ్చింది!"

శూరమంత్రి మరి అక్కడ నిలబడలేక అలాగే రోజుకుంటూ తిరిగి తన పూజాగృహంలోకి వెళ్ళి పరమశివుని పాదాల మ్రోల సాగిల పడ్డాడు:

"పరమేశ్వరా! నాకిటువంటి దత్తపుత్రుణ్ణెందుకు ప్రసాదించావు! నీ కెంతకాలానికి మరి నామీద కరుణకలగదా! నాకిక ఈ సంసార కారాగారంలోనించి విముక్తి లభించదా?"

అని మంత్రి అనేకవిధాలుగా వాపోయాడు. తరవాత తిరిగీ రుద్రాక్షమాల చేత ధరించి నిశ్చలహృదయంతో పంచాక్షరీ మంత్ర పునశ్చరణ కుపక్రమించాడు.

—సశేషం.

# ★ అదిగో భద్రాద్రి! ★

(29-వ పేజీ తరువాయి)

బంగారు వెండి వాహనాలలో కూర్చుండబెట్టి తీసుకువెడతారు.

స్వామితోపాటు ఆయన భక్తుల విగ్రహాలనుకూడా ఊరేగిస్తారు. ఈ పదిరోజులు స్వామిని రకరకాల జవాహిరితోనూ అలంకరిస్తారు. వెండి వింజామరలతో భక్తులు విసురుతుండగా, కొందరు వాహనం మోస్తుండగా దారిలో భక్తులిచ్చే కానుకలను తీసుకుంటూ నెమ్మదిగా శ్రీ రామచంద్రుడు తాతగారిగుడికి వస్తాడు. కళ్యాణానికికూడ స్వామి స్వయంగా తాతగార్ని ఆహ్వానిస్తారు. అక్కడనుంచి త్వరగా దారిలో ఉన్న విశ్రాంతి మందిరానికి చేరుకుంటారు. కొంతసేపు విశ్రాంతి తీసుకొని, మళ్లీ కోవెలకి వెళ్లిపోతారు. రాములవారి ఆలయంనిండా వెండి, బంగారం వున్న కారణంచేత, ఎక్కువగా పోలీసు కాపలా ఉంటుంది. ఒక అణా ఇస్తే జవాహిరి అంతా చూపిస్తారు. రామదాసు చేయించిన లక్ష్మణస్వామి పచ్చల పతకం, సీతమ్మ చింతాకుపతకం, బహువిధములైన ఇతర కంఠాభరణాలు, బంగారుజడలు, వడ్డాణాలు రాములవారి పచ్చలతురాయి, పాపిడిచేరు, ఒకటేమిటి ఎన్నో వస్తువులున్నాయి. ఇప్పటికీ భక్తులు విరివిరిగా విరాళాలిస్తూనే ఉన్నారు. ఇంతకీ ఆ పరమభక్తుడను రామదాసేగదా కారకుడు!

భద్రాద్రి రాముడు భోగిరాముడు. ఆయనను సుగంధ పుష్పాలతో పూజిస్తారు. గుడికి వెనుకభాగంలో కళ్యాణ మండపము వుంది. అక్కడ చాలా స్థంభాలు ఉన్నాయి. శ్రీరామనవమికి అదంతా పందిరి వేస్తారు. కళ్యాణానికి ప్రతి సంవత్సరము హైదరాబాదు నవాబువంశములోనివారు దోసెడు ముత్యాలను పంపుతారు.

నిత్యం తెల్లవారుజామున నగారా వాయిస్తారు. ఒక భక్తుడు తంబుగా పుచ్చుకొని. మేలుకొలుపులు పాడుతాడు. ఈ విధంగా ప్రభాతసేవ జరుగుతుంది. డోలు, సన్నాయి మేళాలతో వెళ్ళి స్వామి స్నానానికి రెండు వెండిబిందెలతో గోదావరీ జలము తెస్తారు. స్వామికి పన్నీటి స్నానం చేయిస్తారు. అభిషేకంచేయించువారు అప్పుడే చేయించాలి. తెల్లవారిన దగ్గరనుంచీ పూజలు, భక్తుల కానుకలు, గుడిచుట్టూ పురాణాలు, భజనలు, హరికథలు ప్రారంభమౌతాయి. శ్రోత్రియులగు బ్రాహ్మణులచే తయారు చేయించిన పులిహోర, దద్ధోజనము స్వామికి నైవేద్యం పెడతారు. ఒక అద్దాలగదిలో తూగుటుయ్యాలలో సీతారాములకు పవళింపుసేవ చేస్తారు. ఒకాయన స్వామిచేత తాంబూలం వేయిస్తారు. ఆ సమయంలో గర్భగుడి అంతా పన్నీరు, అత్తరు మొదలగు సుగంధద్రవ్యాలతో నిండిపోతుంది. పవళింపుసేవ యథావిధిగా ప్రతినిత్యం జరుగుతుంది.

ఆలయంచుట్టూ భక్తుల చిన్నచిన్న గుడులున్నాయి. ముక్కోటి ఏకాదశినాడు స్వామి సింహద్వారంనుంచి గాక, మరొక ద్వారంగుండా తెల్లవారుజామున ఊరేగింపుకి బయలుదేరుతారు. ఆ ద్వారాన్ని స్వర్గద్వారం మంటారు. అక్కడే పల్లకీ ఆపుతారు. ఆ పల్లకీ క్రిందనుంచి భక్తులు అటు ఇటు వెడతారు. అలా చేసినవారికి స్వర్గప్రాప్తి కలుగుతుందని విశ్వాసము. ప్రతి ఒక్కరికి దర్శనం లభ్యంకావడానికిఏర్పాట్లు బాగా చేస్తారు.

భద్రాచలం నుంచి పర్ణశాలకి 22 మైళ్లు. 3 రూపాయలు ఇస్తే బస్సుమీద వెళ్ళవచ్చు. అక్కడే ఒక చిన్న సామాన్యమైన గుడి వుంది. అక్కడే సీతాదేవి పాదాలు, లేడి కాళ్లు వున్నాయి. అక్కడే రావణాసురుడామెను గడ్డతో సహా పెకలించుకుని వెళ్ళాడుట! ఆ గుంట అక్కడ కనబడుతుంది. దానికి కొద్దిదూరంలోనే వారి నారబట్టలు ఉన్నాయి. కాషాయ రంగుగల రాతి బండలవి. సీతారాములు ఆడుకున్న వామనగుంటలుకూడ అక్కడే వున్నాయి. పసుపురాళ్ళు, కుంకుమరాళ్లు కూడా గలవు. పర్ణశాల ఒక చిన్న పల్లెటూరు.

భద్రాచలానికి నాల్గుమైళ్ళ దూరంలో ఉష్ణగుండాలు ఉన్నాయి. సొంతకారు ఉంటే తప్ప, లేకపోతే రెండెడ్ల బండిమీద వెళ్ళాలి. బండిదిగి రెండు ఫర్లాంగులు నడిస్తే, అక్కడ ఒక నుయ్యిలా త్రవ్విఉంటుంది. రెండు అణాలు ఇస్తే, ఒక చెంబెడునీళ్ళు ఇస్తారు. సీతమ్మవారి స్నానానికి లక్ష్మణస్వామి బాణంవేస్తే, ఆ వేడినీళ్ళ గుండము వచ్చిందిట. ఇక్కడ గంధకపు గని ఉందని ప్రతీతి. అందుకే నీళ్లు వేడిగా ఉన్నాయని కొందరంటారు. స్నానం చేసి ఆ వేడినీళ్ళు పోసుకోవాలి.

గట్టుమీద చిన్నహోటలు ఉంది. ఇదే కనుక లేకపోతే ఆ రెండెడ్ల బండీనడకతో భద్రాచలం చేరేసరికి మన స్థితి ఏమవుతుందో ఆ రాముడికే యెరుక! దారిలో రెండు వైపులా పొలాలు, చెట్లుతప్ప ఏమీ ఉండవు.

భద్రాచలం అభివృద్ధిలోకి రానున్న ఒక చిన్న పట్టణం. అగ్రికల్చరల్ శాఖ ఆఫీసు, ఒక ఇంజనీరింగు ఆఫీసు మొదలయినవి ఉన్నాయి. రహదారిబంగళా, ఒక హైస్కూలు, సినిమాహాలుకూడా ఉన్నాయి. నీటిసదుపాయం అంత అనుకూలంగా లేదు. పాలు పెరుగు ధరలు మేము వెళ్లినప్పుడు చాలా దారుణంగా ఉన్నాయి. మామూలప్పుడు బాగానే ఉంటాయనుకుంటా! కూరలు కూడ ఒకమోస్తరుగా దొరకుతాయి. ఆ వూరికి రెండు మూడు సత్రాలున్నాయి.

భద్రాచలం నుంచి వచ్చేటప్పుడు లాంచిని రామగిరిలో ఆపారు. రామగిరిరామాలయం ఉన్న కొండకి నూటయాభై మెట్లున్నాయి. అదికూడ, సామాన్యమైన దేవాలయమే. సీతాదేవిని రావణాసురుడు ఎత్తుకు వెళ్లిపోయినతరువాత, రాములవారు ఇచ్చటనే కూచుని దుఃఖించారట. ఈ దేవుడికి "శోక రాముడ"ని పేరు. భద్రాచలరాముడు "భోగ రాముడు". పర్ణశాల రాముడు "యోగ రాముడు". భద్రాచలంలో ఉదయం ఐదు గంటలకు లాంచీ ఎక్కితే, రాత్రికి రాజమండ్రి వచ్చెయ్యవచ్చు. నీటివాలుకనుక, లాంచీ వచ్చేటప్పుడు వేగంగా వస్తుంది. పల్లు కష్టాలుపడి భద్రాచలంలో రామాలయము కట్టిన రామదాసు ధన్యుడుగదా!

—రాపాక శేషారత్నం] ★



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.

# త్వరలో విడుదల..













శర్వాణీ వారి

# అక్కచెల్లెళ్లు

డిస్ట్రిబ్యూటర్లు:-
**విజయ పిక్చర్స్**